# ముఖ్య పాత్రలు

శ్రీకృష్ణుడు
బలరాముడు
ధర్మరాజు
భీముడు
అర్జునుడు
నకులుడు
సహదేవుడు
అభిమన్యుడు
ధృతరాష్ట్రుడు
దుర్యోధనుడు
దుశ్శాసనుడు
శకుని
కర్ణుడు
వికర్ణుడు
విదురుడు
భీష్ముడు
ద్రోణుడు
అశ్వత్థామ
శల్యుడు
శిశుపాలుడు

## స్త్రీలు

ద్రౌపతి
గాంధారి

ఇంకను సమయానుకూలముగ

# కురుక్షేత్రము

## [ ప్రథమాంకము ]

### శిశుపాల వధ

(ఇంద్రప్రస్థపురమున శ్రీకృష్ణుడు, ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు సహదేవుడు, భీష్ముడు దుర్యోధనుడు దుశ్శాసనుడు కర్ణుడు శిశుపాలుడు మొదలైన వారందరు, వేరు వేరుగ కూర్చుండియుండ తెరలేచును.

**ధర్మరాజు:—** (లేచి) అయ్యలారా! అశ్వమేధయాగ మహోత్స వంబును దిలకింపవచ్చిన మహాజనులారా!

చ. అరయగ నాదు బంధుగణమంతయు కప్పము గట్టుచున్న భూ
వరవరులున్ గురూత్తములు పండితసత్కవికోటి శిల్పులాది భూ
సుర-మధుసూధనుడున్ వెలుగొందుచున్న సుం
దరకరకోల్వు కూటమిది తప్పక మోదముగూర్చి నాకిలన్,

తాతా! భీష్మాచార్య!

ఉ. పావనమై జెలంగు, కురుపాండవ వంశము లందుగూడ నీ
వే వివరింప బెద్దవగుదెంతయు. తాతవు పూజనీయ! నీ
భావ పవిత్రమాది నిజవర్తనముల్ స్తవనీయముల్ మహా
త్మా! వచియింపు మా తెరిని ధర్మయుతంబగు మార్గమేదియో

**భీష్మ:—** నాయనా! ధర్మరాజా! పూజ్యులయందు నీకుంగల భక్తి విశ్వాసంబు లసాధారణంబులు, కావుననే ఇందు నన్నొక పెద్ద చేసి ధర్మమార్గం బుపదేశింపుమని వాఛించితివి.

గీ. సకల ధర్మస్వరూపుడీ చక్రధారి
నీదు మేనమామ సుతుడై నెచ్చెలియయి;
అప్పుడై యడబాయక నలరుచుండ
నడుప నేల? నే నిందు నూతనముగ

ధర్మ—తాతా! దేవకీ సుతుని యండగల్గుట చేతనేగదా మేమింత దనుక సుఖంబుగ నుంటిమి? ఆ మహాత్ముడున్నచోట దుష్టసంహారము శిష్టసంరక్షణము జరుగుచునేయుండునుగదా ? ఐనను నేనిప్పుడు మిమ్ముకోరినది.

గీ. అశ్వమేధయాగంబు సేయంగనిందు
నగ్రతాంబూలమును గొన నర్హులెవ
రనుచు మిమ్ముకర్తవ్యంబు నడిగినాడ
అట్టి మహనీయు బేర్కొనుమయ్య వేగ.

భీష్మ:— పాండునందనా ! ఆవిషయంబు మాత్రము నీకు తెలియనిదా? ఐనను నాయందు పెద్దరికమును చూపించితివిగాన దెల్పెదవినుము

సీ. ఏ దేవదేవుం డహీనప్రతిభతోడ
భూభారమడగింప పుడమిబుట్టె
ఏ లోకమాన్యుండు బాల్యప్రాయమునందె
మహిమంబులెన్నొ యీ మహినిజూపె?
ఏ పుణ్యశీలుండు పాపదూరంబైన
మునిలోక సంస్తవ మూర్తియయ్యె
ఏ భక్తవత్సలుండీ మెయి మమ్మును
కంపమీరార సతతము గాచుచుండె ?

గీ. అట్టిమహనీయు. డాద్యు, డనంతుడతడు
దేవకీనందనుం డిందు తేజరిల్ల
వానినే పూజసేయ భావ్యంబుగాదె ?
తడయనేల ? సంధియమేల ? ధర్మరాజ !

ధర్మ:— మహాత్మా ! అటులనేచేసెదను ! కృష్ణా ! భక్తవత్సలా!

శా. లోకారాధ్యుడవీవు మౌనిగణ సుశ్లోకుండ వెంతేని ము
ల్లోకాతీతుడ వవ్యయుండవు మహోల్లాసంబు పెంపొంద ర
మ్మా! కేల్మోడ్పులవే గ్రహింపననుసుమ్మా అగ్రతాంబూలమున్
చేకొమ్మా! సురకోటి వాంఛితములే సిద్ధింప నిక్కంబుగన్.

శ్రీకృ:— పాండవాగ్రజా నీయభిలాష నేను నిరాకరింతునా? నీయిచ్చవచ్చినటులే గావింపుము. (అగ్రసింహాసనమున గూర్చుండును (పాండవులు శ్రీకృష్ణుని విధివిధానముగా పూజింతురు)

భీష్ము:— ఆహా! హరిచరణారవింద సేవా భాగ్యంబుగ నీ పాండునందనులు ధన్యత చెందిరికదా ?

ధర్మ:— ఆహా! ఏమీ మా భాగ్యము?

సీ. పావనగంగా ప్రవాహమెచ్చోట, ను
త్పన్నమై యెవ్వేళ బారుచుండు ?
సురమునీంద్రాది భూసురులు నెద్దానిని
స్థిరభక్తి మీర పూజించుచుండు
రాతిగా బడియున్న నాతికెయ్యది నిజ
రూపు ప్రసాదించి రూఢికెక్కె ?
కాళీయు మాళిపై కౌతుకంబున నద్ది
గర్వాపహారణంబు ఘనత జేసె ?

గీ పావనంబైన నా కృష్ణపాదయుగముఁ
గడిగి, పూజించి ధన్యతగాంచినాడ !
మీరు. మీరు, మీరును మీరు మీరుగూడ
కనులగాంచి తరింపుడో యనఘులార !

శిశు:-చాలు చాలు ధర్మజా! చాలింపు మీ వాచాలత్వము, ఆ వెఱ్ఱి గొల్లని కీవగ్రత్వ మొసంగి సంతోషించితివి. నీవ టెమాకునుమతి పోయిన దనుకొనుచుంటివా యేమి?

మ. ఇతఁడా గొల్లడు: రాజగౌరవమున వీడేరీతినర్హుండు దాం
గతనంబీతని ముఖ్యవ్యాప్తి నృపవర్గంబెట్లు సైరించు దు
ర్మతికి యగ్రతనం బొసంగుటెది మామర్యాదకుం లోపమ
య్యెః తలుపన్ సాతివారమెనే యిపుడు నీకేమైన భీమాగ్రజా!

భీష్ముడు!—(రోషముతో) ఓయీ! శిశుపాలా! నీకా మురారిపై పూర్వవైరంబులుండినయుండునుగాక; వాటినిందుజూపి వృథా కలహంబునకుం గడంగెదవేని నిన్నిదే మదీయ గద కాహుతి చావించెద.

దుర్యో:-భీమసేనా! సభామంటపంబున వ్యతిరేకుల వాగ్వైఖరిని గూడవిని న్యాయాన్యాయంబులు నిర్ణయించుట రాజధర్మము, గాన శిశుపాలుం డేమనునో పూర్తిగ బల్కనిమ్ము

అశ్వ:- రాజరాజా! పూజ్యుల నిందించు దుర్మార్గులకు సైతమీ రాజ సభలయందు స్థానమొసంగ వలయునా?

కర్ణు:- అది నీవిశ్వాసంబైన నగుగాక దుర్మార్గంబేదియో సన్మార్గం బెయ్యదియో సభాసదులు నిర్ణయించిన పిమ్మటనే నేరస్థుల దండింప వలయును.

నకు:- ప్రజ లజ్ఞానులై సత్యమును గుర్తింప లేనిచో?

ద్రోణు:- మాద్రేయా! ప్రజ లజ్ఞానులైనచో ధర్మోపదేశము చేయుటకు రాజసభలయందు మంత్రులు లేరా న్యాయవాదులు లేరా? గురుజనంబులు లేరా: ధర్మమునిర్ణయించువారు-సత్యమెరుంగువారే లేకపోదురా!

సహ॥గురువరా! శిశుపాలుం డేమనునో ప్రేలనింకు పిమ్మటనే.......

భీష్ము:- సహదేవా! శాంతింపుము.

శిశు:- భీష్మాచార్యా! సహదేవుం డేమిసేయునో చూతము రానిమ్ము విస్సన్న చెప్పినదియే వేదమన్నట్లు లీపాండవులచే పూజింపబడిన వాడే పరమ పూజ్యుడా? ఆధర్మజుండాడు తయితక్కుల కీబుద్ధి మందగించిన పెద్దలందరానాదింపవచ్చును గానినావంటివీరాగ్రణి సైరింపడు

సీ. పాల్వెన్నమీగడల్ పలుమారు మెక్కంగ
నిల్లిల్లు దూరిన నల్లదొంగ
జలకేళికలదేలు జలజాక్షుల చీరె
లెత్తుకబోయిన హీనబుద్ధి
తల్లితో బుట్టుపై తగు శ్రద్ధయే లేక
కంసుని జంపిన కర్కశుండు
మేనత్త యచించు కేనియు నెంచక
రాధారమణుడైన రంకుగాడు

గీ. తల్లిదండ్రులు పరుల కీదలచియున్న
కన్నియలదెచ్చి పెళ్ళాడు కల్మషుండు
జార, చోర హింసాకారి చక్రధారి
అగ్రపూజ కే చందాన నర్హుడయ్యె?

భీష్మ:— శిశుపాలా ! దేవదేవుండని కీర్తిగాంచిన వాసుదేవు నిట్లు తూలనాడ నగునా?

శిశు:— (వికటముగ నవ్వి) తెలియని వారీ తాంత్రిక వాదిని చూచి యేమైన నచ్చునుగాని తెలిసినవారందురా ? అనువారలను చుండ విని యూరకుందురా ? అట్లుద్ఘాటించు నద్దుర్మార్గు నాల్కలను పట్టి చీల్చుచుందురుగాని—

అర్జు:— ఓయీ! శిశుపాలా! "కానీ" యని యూరకుంటి వేమి? నిఖిల ధరావరపరివేష్ఠితసభాస్థలినీనందనందనునినిందించిన నీనాల్కకా శిక్షయే గావించెదను చూడు.

మ. అణుమాత్రంబు భయంబులేక; కడగర్వాంధత్వముం జెంది కృ
ష్ణుని నిందించినపాపి ; నీదుతనువున్ శూలాల చీల్పింప కే
ననుకంపన్ గనబోను నింక భవదీయానేక పాపంబు లీ
క్షణమందున్ మరిపండి బ్రద్దలగు నక్కాలంబు చేకూరెడెన్.

భీము:— తమ్ముడా! ఈ శిశుపాలుం డింతదనుక మన పినతల్లి కుమారుం డని సైరించితినిగాని; లేకున్నచో....

ఉ. ఊరక పిన్నతల్లి తనయుండని సైచితినిగాని; వీను కం
సారిని నిందసేయు దురితాత్ముడటంచు దలంచియున్న దూ
ర్వారగదాహతినిన్ శిరము వ్రయ్యలుసేయక వీడియుందునే ?
వారిజనాభునిన్ దెగడు వారలె వారలొ చూడకుందునే ?

భీష్మ:— "ఓభీమార్జునులారా ! శిశుపాల శిరచ్ఛేదనమంత సులభ మనుకొంటిరా! కాదు. కాదు. మీరను నీతండు నక్క చెల్లెండ్ర బిడ్డలగుటం జేసి వారికీ శిశుపాలుండును మేనత్త కుమారుడే. కాని వాని బాల్యంబున వీని తల్లి శ్రీకృష్ణుని పాదంబుల వ్రాలి అల్లుడా! నా కుమారుని నూరు తప్పుల సైరింపుమని కోరుటచే నాత డంగీకరించె.

గీ. అత్తకిచ్చిన వాగ్దాన మాత్మనెంచి
నూరు నేరంబులను సైచు కారణమున
తొలిగియున్న కృష్ణుడే వీని దునుమవలయు
పరులు శిశుపాలుని వధింప తరముగాదు.

శిశు;— (వికటముగనవ్వి) తాతా! ఈ కట్టుకథలెక్కడనేర్చితివయ్యా ఈ వెట్టిగొల్లడుసన్ను చంపువాడా? నేను చేసిన నూరు తప్పుల సైరింపుమని మాయమ్మ ఈ వెన్నదొంగ పాదములపై బడినదా? అదినీకు తెయునా? అహాహ చాలు చాలు- కుక్కనుదెచ్చి కనకపుపీఠంబున గూర్చుండ బెట్టినటు లున్నది,

మ, కులమా? గోత్రమా? రాజనందనులలో కూర్చుండగా పాత్రుడా?
యిం నెందేనియు గౌరవంబు? యశమా? యీపాటివిజ్ఞానమా
విలసత్కీర్తి ఘటించు ధర్మ పథమా! వీడౌర! త్రాష్టుండు మా
తలవంపుల్ మరి సేయ చేసితివిగా మర్యాదపాటింపకన్.

పాండునందనా! మీకేమైన కోపమురానిండు, ఈవాసుదేవుని యాగత్వంబునకు మేమెవ్వర మంగీకరింపము. ఇందున్న మహనీయుల కంటె నీతం డెట్టు లధికుండయ్యెనో చెప్పుడు

సీ, నవఖండ మండలై కవిభుండు— నీయుంటి
వాడు, సుయోధన చక్రవర్తి
మూడు తరాలకు పూర్వమునుండియు
బ్రహ్మస్థలినున్న గంగాసుతుండు
అస్త్రశస్త్రాది విద్యాప్రవీణతగన్న
ద్రోణుండు మీకెల్ల దొడ్డగురువు
క్షత్రియవంశ సంజాతులై యొప్పి
రాణకెక్కిన వీర రాజవరులు

గీ. ఇకనెందరో మహనీయు లిందుగలుగ
నూరుపేరుయులేని మురారి నౌర
పెద్దజేసి పూజింపగ బుద్ధిలేదె
తగుదునంచు సిగ్గేటి కితనకిలేదొ

శ్రీకృ:—(రోషముతో లేచి) మహాజనులారా! నేనింక నీకలుపాత్ము సైరింపను— సైరింపరాదు, ఓయీ! మూర్ఖ శిశుపాలా

గీ, ద్వారకానగరంబెల్ల తగుల బెట్టి
పరగ వసుదేవ యాగంబు పాడుచేసి.
చెప్పరాని దుష్కృత్యము చేయుచున్న
నేటిదాక గడచిపోయె నీదుబ్రతుకు

మరియును

గీ. నాడు నీతల్లికిచ్చిన నాదువరము
తలచుచుంటి కావున- నూరు తప్పులైన
చూచి చూడక నరకంట చూచినాను
గాని, నేటితో దీరె నీగడువు దినము

(చక్రమును చేత ధరించి) ఓసుదర్శనమా

గీ. మహిని మేనత్త సుతుడన్న-మాటెగాని
చేతలందెన్న దానవశ్రేణివాడు
మాని జనకంటకము-వీని మస్తకంబు
దునుము మింక-భూభారంబు దొలగు కొంత

(తెరవ్రాలును)

# ద్వితీయాంకము

## మయసభ—ప్రీతికాలము

మయసభయందు దుర్యోధనుడు ప్రవేశము

దుర్యో:—ఆహా! ఇది మయసభ మయబ్రహ్మ తన శిల్పకళా కౌశల మంతయునిందుపొందుపరచెగదా! ఇట్టి నేత్రోత్సవ వదృశ్య సంభరిత సభాలభ్యంబున పాండవులంతయు నదృష్టవంతులుగదా? ఆహా! ఏమీ. యీ సభామందిర సౌందర్యము? అవి సువర్ణ మయద్వారమందిరములు-అవి మణిఖచిత సింహాసనంబులు— అవిబంగారు సరిగంచులు గ్రోలు దివ్యాంబరసముదాయంబులు అవి యన్నియు మంచి ముత్తియంబులు గూర్చిన జాలరులుఅవి అవి అవియన్నియు వర్ణింప దుస్తరంబగుచున్నదా? ఈ యధోభాగంబుగను మృత్తికా స్వరూపం బగోచరంబయ్యె ఇందలి మార్గంబులన్నియు పాలగచ్చురాలా నవరత్నరంబులను పొందపరచినశిల్పప్రతిభయా!

గీ. ఇంద్రభవనంబొ కాక— నాగేంద్రపురమొ?
పోల్చుకొన శక్యముగాని పూర్ణశోభ
వెలయు నీమయసభ భూపతులకు నెల్ల
యీర్ష్యగలిగించె నెంతో కన్నిట్టిగాక

ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చినకొమ్ములువాడియన్నట్లు చిరకాలంబుబునుండి హస్తినాపుర సామ్రాజ్యసింహాసనం బేలుచున్న నేను గడింపలేకబోయినను, మాపినతండ్రి బిడ్డలగు పాండవులైనను మహావైభవోపేతంబగు నీమయసభ గడించినందులకు దేశదేశరాజ చూడామణులందరు జోహారు లర్పింప నీయశ్వమేధయాగంబు గావించి నందుల కెంతయు సంతసింపనగు.

గీ॥ ఈ మయసభావిశేషంబు లెల్లగనుచు
నింద్రనీలిబొమ్మ చందమునగ
ధర్మజుండు కొలువుదీరు తరుణమయ్యె
వారలనుజేర బోవంగ వలయుగాదె!

(త్వరత్వరగ నడువ మొగంబునకు గోడతగులును - అంత నదు కాడి. చేతితో తడివిచూచి) ఆహా! ఏమిది? ఇంత దనుక నీసభా వైభవమునే దిలకించితినిగాని- యిందిట్టి విచిత్రదృశ్యము లున్నట్లు లెరుంగ నైతినే! ఇది కఠిన పాషాణ నిర్మాణమయ్యు చూచుట కిందు ద్వారమున్నట్టులు గన్పట్టుచున్నదిగదా! అవిరళంబున నుండుట చేతనే కన్పట్టుచుండియు. (గుడ్డివాడనైతిని (నలుదిక్కులు చూచి) కాకాయింతెపనసు నా యవివేకకృత్య మవలోకింప లేదుగదా ?

(తెరలో) చెలీ! దానికేమే! దుర్యోధనసార్వభౌముడు అంధరాజుగారి కుమారుడుగదా! వారికట్లు కన్పట్టుట నైజమేలే,

దుర్యో:- (ఆలకించి) ఆ పరిహాసించుచున్న దెవరు ? పాండవ పట్టమహిషి పాంచాలియా! కాదు - కాదు ద్రౌపది నామరదలు, నన్ను పరిహసించునా. పరిహాసింపదు, ఐన నా దాసీ ముండ లెవరో పరికించెద. (రెండడుగులు వైచి) ఇందీ నీటిమడుగు లెక్కడివి? ఎక్కడివైన నేమి ? బట్టలు తడువకుండ నించుక జాగ్రత్తపడియెద. (అని రెండు చేతులతో పాదాలపై వంచను దొత్తిపట్టుకొని నడచి) ఏమిరా? ఈవిచిత్రము? పాదముల కింత తడియైనను తగలలేదే ? ఇది జలభాగము కానటులున్నది. ఔరా! ఇంద్రనీలమణి గణదీప్తి ప్రతిబింబించి జలాశయంబట్లు దోచినదే! కానిమ్ము. ఇంకెవరు లేనటులున్నారు-త్వరగ రాజసభను సమీపించెదను. (మరల నడచి నీటి మడుగులో బడును- బట్టలు తడిసిపోవును.) ఏమి ? ఇది జలాశయమా?

అగుగాక —

ఉ॥ భారతగాథలో మయసభా విభవంబు నపూర్వదృశ్యమే.
ద్వారము లేకయే కలవిధంబున దోచు జలంబె లేకయే
పారుచునున్న భాతి గనుపట్టియు నీ జలభాగ మేటికో
నీరము లేనటుల్ వెలయు నిక్కముగా నవమాన మందితిన్

(తెరలో పెద్దగ నవ్వులు వినవచ్చును) ఎవరు? (నలుదిక్కులు చూచి) ఎవరా పరిహసించునది? ద్రౌపది. ద్రౌపది నన్నుచూచినవ్వు చున్నదా. ఈ కులట మహాపతివ్రతయందురిదియేనా దీని పాతివ్రత్య ధర్మంబు. బావను — నవఖండమండలాధినాథుండను, — రాజవంశా చారంబునకీసరోర్వీతలంబు నేకఛత్రాధిపత్యంబుగ బాలింపనర్హుండనే గాక దీర్ఘశత్రులు పినతండ్రిబిడ్డలనియు రాజ్యమొసంగుమనియునాతండ్రి గారు సెలవిచ్చుటచే నీ యింద్రప్రస్థపురంబు నొసంగిన రాజదాతను— ఇంతియేనా? కాదు. ఈ పాండవులు తలపెట్టిన రాజసూయయాగ మహోత్సవంబును దిలకింపరమ్మని యాహ్వాన మంపినతోడనే సగౌర వంబుగ నరుదెంచిన బాంధవుండను, — సాటి బాంధవుని సంహరించు చున్నను వాని నిరంకుశంబున కదిశిక్షయగులెమ్మని, సహోదరవత్స లతంబు వహించి మిన్నకున్న నాత్మీయుడను, వీరునన్నెట్లుగౌరవించ వలయును? వీరి కీమయసభ లభించుగాక — మహాత్మ రాజసూయ యాగంబును గావించినధీరులే యగుగాక — వాసుదేవ సహాకారసంపత్తి సమకూడుగాక నాకీయదగిన మర్యాద నీయవలదా? ధర్మజుండు మహా ధర్మమూర్తి యందురే? ఇదియే నాధర్మము? తమ్ములతో "ఓయీ! మన సుయోధనున కీమయసభ విచిత్ర దృశ్యంబు లనుభవంబులుగావు గాన, మీరు వెంటనుండి చిత్రంబులనుచూపుడని యాజ్ఞాపింపక నన్నట్టు లొంటరిగ విడిది భవనంబునకు పంపించి, పరాభవించి, ఆడుదానిచే నవ్వింతురా? దాసీలు తెలియక నవ్వినచో "తప్పు" ని మందలించవలసిన యీ ద్రౌపది తానే స్వయముగ నాయెదుట నిలిచి నవ్వునా? అంధ రాజకుమారుడంచు పరిహాసములాడునా? కానిమ్ము. ఈనాడు నేనీసీటి యందుండ నీతొత్తు యంతఃపురముపైనుండి నవ్వినదిగదా? నేను నా రాజపీఠంబున గూర్చుండి యీ కుటిలను దాసిగ నా కొల్వునకీడ్పింపక పోవుదునే? అభిమానధనుండనగు నన్నవమానించిన యీ తొత్తును నానిండుసభలో వస్త్రహీనను గావించి మానభంగము సేయక నాకసి దీరునే? తీరదు, ఆడదానికే యింత పొగరున్న నాకెంత గర్వముండ వలయును? (ఎదుటచూచి) ఎవరావచ్చునది?

(భీముడు, అర్జునుడు, సహదేవుడు, — నవ్వుచుప్రవేశము)

భీము:— (పరిహాసముగ) కురుసార్వభౌములవారు జలకంబులాడు

చుండిరా ?

అర్జు;— లేదు. లేదు! మయసభలోని జలాశయంబుల లోతు జూచు చున్నారు.

నకు:— అన్నగారికి పొడి వస్త్రములు తెప్పించుచున్నాను.

సహ:— ధర్మజుండు కొలువుదీరియుండెను. త్వరగ పోవుదము...

భీము: (దుర్యోధనునకు చెయ్యి నందించి) అన్నయ్యా! ... సభను చేరుకుందము.

దుర్యో;- అటులనే — (తెర వ్రాలును)

## రెండవ రంగము

(హస్తినాపురము రాజభవనము - దుర్యోధనుడు)

దుర్యోధనుడు:— ఆహా !

ఉ॥ కూరుకు రాదు కంటిపయి; కోరిక లెల్ల నశించిపోయె: ఆ
హారము గైకొనంగ జఠరాగ్ని యు వింతగ మందగించె సం
సారసుఖంబులన్ దలుప సారవిహీనములయ్యె: మా...
హారములున్ భుజంగముల యట్లు మనంబు ...చేదున్,

[అని ముసుగు బెట్టి పవ్వళించును]

(శకుని ప్రవేశము)

శకుని;— నాయనా ! దుర్యోధనా ! ఎందుంటివోయి? (ముందు చూచి) ఓహో!యితడిందు చింతాక్రాంతుడై శయనించియుండె నేమి చెప్పుమా? (సమీపించి) దుర్యోధనసార్వభౌమా! లెమ్ము.

దుర్యో;— (దివాలున లేచి) మామా! మీ దుర్యోధనుడు పాండవేయుల మయసభలో మరణించినాడు,

శకు:— (చెవులు మూసుకొని) హరిహరీ !

దుర్యో;— హరిహరీ! ఆహరియే పాండవపక్షపాతియై ... నింత పరిహాసింప చేసినాడు,

శకు;— ఏమి జరిగినది ?

దుర్యో:— ఇంకను యేమికావలయును మామా ? ఆనాడు - ఆమయ సభలో- ఆ జలాశయమున నేను బడియుండగ ... అందు మా మరదలు దాసీజనసమేతంబుగ — అంతఃపురము వెక్కి ముఖాముఖిని నిలిచి; పక్కునవ్వి పరిహాసించిన ఆదృశ్యములు

నన్ను మాటిమాటికి నీ జెపోటులవలె బాధించుచుండ నింక మేనల్లున కెక్కడి మనశ్శాంతి ? యెక్కడి రాజ్యవైభవము?

శకు;- అందులకు నీ వేమిసేయ సంకల్పించితివి:

దుర్యో- ఆ దుర్మార్గురాలునన్నవమాన పరచి నటులే దానిని దాని మగలందరు చూచుచుండ వలువలొలిపించి యవమానపరచు వరకునాకీ క్రోధాగ్ని చల్లారదు, ఏ పాండవులు నన్ను పెత్తండ్రి బిడ్డడనియు, చక్రవర్తి ననియు, రాజ్యాధికారము లేని తమ కా యింద్రప్రస్తమొసంగిన సోదరుండనియు నెంచక ప్రక్కనుండి యాడుదానిచే నవ్వించిరో ఆపాండునందనులయెదుట నే మరద లని యాడుదని పాపమని దలంచక దానినివస్త్రహీనను చేయుక తప్పదు—

శకు:- నాయనా! నీపరాభవము నా పరాభవముకాదా ? అందులకు నేను మాత్రము సైరింతునా ? కాని —

ఉ. పాండవరాజ్యలక్ష్మి విభవంబు ఘటించె; అవారి కాముకుం
డుండు సమస్తకార్యములతోడయి బాయకనుండె కాన వే
రొండు నెపంబులేకయె. సహోదరులే గనుచుండ. దానినిన్
నిండు సభాస్థలిన్ నిలువనేర్చినగాదె పరాభవింపనా ?

దుర్యో- ఔనౌను, ద్రౌపదీ పరాభవము జరుగదు — దుర్యోధన మనశ్శాంతిచేకూరదు. కావుననే దుర్యోధనుడా పాండ వేయుల మయసభలో మరణించెనని చెప్పితిని. మామా! నవఖండ మండలాధీశుండనై — ధృతరాష్ట్ర శతసుతులందగ్రజుండనై — సర్వోర్వీచక్రంబును శాసించగల సార్వభౌముండనయ్యు నొక్క యాడుదానిపై ప్రతీకారము చేయజాలకపోయిన నాకింకనీబ్రతు కేల ? రాజ్యభోగములేల? లేదు — దుర్యోధనుండింక లేడు.

శకు— నాయనా! శాంతించుము తొందరపడి నీ వేమియు ప్రమాద ముల పాలుగాకుము — ఔరా ! ఈపాండవు లెంతటి మాయో పాయముగలవారు ?

సీ|| తొలినుండి కపటులై దొసగులన్నియు: కౌర
వులవంచు మాయలు సలిపినారు:
కుశపతిదయచేత, కోరి. యింద్రప్రస్థ

పురమేలు రాజులై పొంగినారు;
రాజసూయము చేసి రాజలోకమునందు
పలుకుబడి నొకింత బడసినారు;
గర్వాంధకారులై కౌరవేంద్రునిగూడ
వెరువక నవమాన పరచినారు;
గీ॥ ఇపుడు దుర్యోధనుండు సహించె నేని
ధరణి సర్వమేలంగ లోదలచినారు
వారు చేయుచున్న కపటోపాయమందె
వారి నోడింపక జయంబు బడయలేము

(ఆలోచించి) ఆఁ! దుర్యోధనా! మంచి యుపాయమేతోచినది, మాతండ్రిగారు నా కొసంగిన మాయాపాచికల ప్రభావంబు నీ వెరుంగుదువుగదా! నేను చెప్పినటులు చేసి, మీ నాయనగారి నొప్పించి, పాండవుల నిందొకమారు రప్పించునట్లు చేయుము. అప్పుడు....

దుర్యో:— అప్పుడు?

శకు:— ధర్మజునకు జూదమనిన మిగులయిష్టంబు. వానికి జూదంబునకు రమ్మందుమేని మన రాజ్యసర్వస్వంబును పాచికలతోడనే గడించవచ్చునుగదా యను దురాశ్రున తానంతగీకరింపక మానడు. అతడెంత ప్రజ్ఞావిశేషంబుగలవాడైన నేమి ప్రయోజనంబు? మన మాయాపాచికలముందు యితనేమి సాదేవుడు గెలువనేరడు,

దుర్యో:— అందువలన పాండవరాజ్యంబు మనకు చేకూరును విశేష మణిమయ కనకవస్తునానాంబరంబులు లభించును—కాని, అవమానమునకు ప్రతిక్రియ సేయుటెట్లు?

శకు:— వెఱ్ఱివాడా!
గీ॥ జూదమున నెట్టులో ధర్మజునకు పోరు
పంబుగల్పించి, కవ్వించి, సభను బెట్టి
తమ్ములను, భార్యనోడింతు, తప్పకపుడు
కలుగు నీకధికారంబు కౌరవేంద!

దుర్యో:— (సంతోషముతో) షెహభాష్! మామా అటులే చేయుదము. రమ్ము దీనినెట్లు నిర్వహింపవలయునో యోచింతము.

(తెరజారును)

శ్రీరస్తు

# కురుక్షేత్రము

## తృతీయాంకము

## [జూదము వస్త్రాపహరణము]

(హస్తినాపురము, పాండవులు శకుని-దుర్యోధనులు ప్రవేశము)

ధర్మ:— సోదరా! సుయోధనా! పెదనాన్నగారితో మాటలాడితిని. మీ క్షేమంబు లెరింగించితిని. మేమింక పోయివత్తుమా?

దుర్యో:— అన్నయ్యా! ఇంతలో నేమితొందర? నేను మన మందరము వినోదంబుమీర జూదంబు లాడవలయునని దలంచుచున్నాను.

ధర్మ:— ఏమి జూదమా? వ్యసనాయుతమైన జూదము తగునా?

దుర్యో:— రాజుల కదియు వినోదక్రీడగదా! ధర్మజుండు జూదంబున ప్రతిభావంతుడని వినియుండుటచే నిన్నిటు లర్థించితిగాని లేకున్న నేనేల కోరుదును? మీ కందంత నిపుణత్వమే లేకపోయినచో బలవంతమేమియు లేదు.

ధర్మ:— నిపుణత్వము లేక నేను భయపడుట లేదు.

శకు:— అల్లుడా! ధర్మరాజా! నీవు భయపడినట్లు నేను గ్రహించితిని. తెలియనివిద్య తెలియదని చెప్పుట లోపమా?

భీము:— పాండవులు యెందును భయపడువారుగారు.

శకు:— అటులైన శకునితో పందెము వేయగలరా?

అర్జు:— ధర్మజునితో జూదమాడుట ప్రమాదకరము

దుర్యో:— అర్జునా! జూదంబున వీరిరువురును ప్రసిద్ధినొందినవారుగాన శకునీధర్మజుల జూద మవలోకింప వేడుకగుచున్నది.

ధర్మ:— సుయోధనా! అంతగ కోరితివిగాన నీకోరిక నంగీకరించితిని. జూదక్రియ నుపక్రమింపుము

దుర్యో:— సంతోషమేకాని — ఒక్కమాట,

గీ॥ దీటుగలవారి తోడనే పాటుబడిన
ప్రాజ్ఞులొప్పుదు రెంతయు పాండుపుత్ర!
నీకు దీటు — శకునిమామ నాకు మారు
నాడగలడయ్య! పందెమెట్లయిన నాదె.

ధర్మ— సరె, కానిండు,

(ధర్మజ శకునులు జూదమాడుచుండిరి)

శకు— పాండవాగ్రజా! మా దుర్యోధనుని పక్షంబున నీ నవరత్న మణిహార శతంబును పణంబు నొడ్డితిని, మరి నీ పందెమేమి?

ధర్మ— నేనును నవరత్నమణిహారశతంబు పణంబిడితి నిదిగో పందెము వేయుడు. (పాచికలు వేయును)

శకు— ధర్మనందనా! మొదటివందెము నీవే గెలిచితివి, మా మణిహారంబునుగూడ నీవే గైకొనుము, మరల పందెమేమి?

ధర్మ— ఇంతకుముందు నే నొడ్డినదియే గాక మీరొసంగిన హారంబులతో గూడ కలిపి పణంబొడ్డితిని. మరి మీపందెము?

శకు— ఆ మొత్తమునకు సరివచ్చు ధనరాసులివిగో. మరి పందెము వెయ్యనా! (పాచికలు వేసి) సుయోధనా! ఈ సారి గెలుపునీది

దుర్యో— మూడవపందెము గావింపుడు.

శకు— యుధిష్ఠిరా! ఈ మొత్తంబును నేను పణంబు నొసంగితిని మరి నీవేమి పందెమిచ్చెదవు?

ధర్మ— దీనికి దగిన ధనరాసులొడ్డితిని, పందెము వేయుము.

శకు— (పందెము వేసి) ఈసారి గెలుపుయుమాదే. ధర్మజా! తరువాత పందెమేమి?

ధర్మ- ఇంద్రప్రస్థంబున గల ధనాగారమును. మణిహారకోటిని. రజిత కనకభూషణంబుల పందెంబునందుంచితిని, ఇదిగో పందెము.

శకు:— ఈ యాటయు మాకే జయమైనది, తరువాత;

ధర్మ:—మయసభ సమేతంబుగ నింద్రప్రస్థసామ్రాజ్య సర్వస్వంబును. పణంబొసంగుచున్నాను. మరి పందెము వేయుము.

శకు!— పాండునందనా! గెలుపుమాదే మామయసభనేగాక యింద్ర

ప్రిస్సంబును గూడ యోచితివిగాని అధికారమున్న దిలింక రారాజున కొసంగుదు

ధర్మ;- ధర్మమునకు కట్టుబడిన మేము వెనుకాడుదమా గైకొనుడు (ఇచ్చును

దుర్యో;—పాపము మీరాయొద్ద నింక నేమియు లేదు కాబోలు

ధర్మ;- (రోషమున ఆం కవచకిరీటాది భూషణంబుల నేని పణంబిడ కుందునే?

శకు!—ఐనరమ్ము. ఇదిగో పందెము (పందెము వేయును) కౌంతేయా ఈసారియు గెలుపు నాదే మరి తదువాత పందెమేమి?

ధర్మ;—మామా! ఇంక నావద్ద నేమి కలదు?

శకు;—ధర్మనందనా! మయసభాసమేత రాజ్యలక్ష్మి వైభవంబులు పోయిన నేమి?పణంబిడలవలయునన్న నీవద్దసొమ్ము లేకపోయినదా

గీ, నాల్గుపెన్నిధులన నొప్పు నల్వురనుజు
లంతకంటెను ద్రౌపదీ కాంత యుండ
శంకనొందనేటికి హారిశ్చంద్రుడంత
వాడు సతి నమ్మడే ? సత్యపాలనమున.

భీము;-ఔరా। వీరందరు నేదియో మోసము చేయుచున్నారు'

అర్జు;-వాయునందనా! శాంతింపుము అన్నగారి యభిమతంబునకు మనమంగీకరింపక తప్పదు

నకు- ప్రమాదము సంభవించునేమో

సహ; —అది ధర్మసంభవుడే యోచింపవలయును

ధర్మ; —మామా! శకుని ఇంతదనుక వచ్చిన పిమ్మట నేమి చేయుదును

ఉ. అందరికన్న పిన్న వినయంబునమిన్న స్వధర్మవర్తనం
బెందును చాయబోడు విజమెన్న భళీ పశుపాలకుండుకీ
ర్తొందిన రాచబిడ్డ దతడొప్పగ మాసహదేవు నిందునే
పందెము నొడ్డినాడ పయిపందెము వేయుడు జూదమందునన్.

శకు: —మా పైపందె మిందే యున్నది ఇదిగో పాచికలు వేయుచున్నాను [వేసి ధర్మనందనా ఈయాటయు మేమే గెలుతు

కొంటిమి, మీ సహదేవుడింక మాకు బద్ధపడవలయును, మరి తరువాత పణంబు దెల్పుము.

ధర్మ:- ఇదిగో చెప్పుచున్నాను—

గీ|| మాద్రి కగ్రసుతుడు, నసమానబలుడు,
సర్వసద్గుణమూర్తియై జగతి వెలుగు
నకులునే పణంబిడినాడ ప్రకటితముగ
కనుడు, పందెమిదిగో, కాచుకొనుడుమీరు,
(పందెము వేయును,]

శకు:- ఆఁ! ఈపందెముగూడ మాదే, ధర్మజా! తరువాత పందెమేమి?

ధర్మ:- తరువాతనా?

మ. విలువిద్యన్ మదనస్వరూపమున నా పేరొందె నెవ్వాఁడు? ఆ
జలజాక్షుండు నెవానికిన్ మరదియై సంతోషమున్ గాంచు, నే
కలుషాంతుండు, మదీయసోదరుడు, విఖ్యాతప్రపూర్ణుండు, నా
తలపుల్ బండ, పణంబుగా నిలిచె జూదంబందు నిక్కంబుగన్

శకు:- (పందెమువైచి) అర్జునుడును మా స్వాధీనంబయ్యె. తరువాత

ధర్మ:- సరే కానిండు.

గీ|| విసము మెక్కి జీవించిన వీరబలుడు,
బకుని యమపురి కంపిన బాహుబలుడు;
అట్టి భీమసేనుని పణమందు నిడితి
గొంకుయే లేక యీ చదరంగమందు

శకు:- పాండవాగ్రజా! భీమునిగూడ నోడిపోయితివి,

ధర్మ:- ఔను. ఓడిపోయితిని. దుర్యోధనా! నల్వురు తమ్ములను గోల్పోయిన నాకింక స్వార్థమేల? నేనును పణంబుగ నియమింపబడితిని, ఈసారితో గెలుతునా నాసహోదరుల మరల గైకొందును, లేదా? నేనునుగూడ వారితోబాటు మీ సేవకుండనయ్యెదను. పందెము వేయుడు

శకు:- [పందెము వేసి) ధర్మజా! నేడు మా యదృష్టవశంబున నిన్నుగూడ గెల్చితిమి, ఇక నేమనియెదవు?

ధర్మ:— ఇంక పణుట కేమున్నది?

చ. మణిమయహేమహారముల మాణిక పట్టు దుకూలసంపదల్
పణముగ రాజ్యమున్ మయసభన్ నవరత్నకిరీటమాది నా
యనుజుల దాసినాడ సరియా? యిక నేను మిము నోడి పో
తిని. యిక పేదవాడ; కలదే? యిక పందెము వేయనాకడన్!

దుర్యో:— దానికేమి? నీవు తలంచిన పణంబునకు సొత్తు లేకపోయినదా?

ధర్మ:— ఏదది?

దుర్యో:— మీ ద్రౌపది—

భీమ:— (రోషముతో) ఆఁ!

అర్జు:— అన్నా! శాంతింపుము.

ధర్మ:— సుయోధనా! అటులే గావింపుము, మా భాగ్యఫల మీకడసారి పందెమునందె నిలిచియున్నది.

ఉ. జన్న మొనర్చ హోమమున జన్మమునొందిన రాచకన్నె ఆ
యన్నులమిన్న సాధ్వియను ఖ్యాతిగడించిన కోమలాంగి నే
గ్రన్నన పందెమందిడితి కాచుకొనుండు, ఫలంబదెట్లు కా
నున్నదొ? చూచువాడ సిక యోటమియో? జయమో?
ఘటింప కుండునే?

(అనుచు పందెమువేసి చింతించుచు గూర్చుండును)

శకు— దుర్యోధనా! పాంచాలిగూడ నీకు దాసియైపోయినది, ఇక నీ యిచ్ఛవచ్చినటులు గావింపుము,

దుర్యో— అ హ హ హ! పాంచాలి మాదాసియైనదా పాండవేయుల మిడిసిపాటు హరించినదా? అ హ హ హ!

(దుశ్శాసనుడు ప్రవేశించును)

దుశ్శా— అగ్రజా! రాజసభా సమయమగుటచే నాన్నగారు భీష్మ ద్రోణాది కర్ణులు వచ్చుచున్నారు.

దుర్యో— జూదంబున పాండవులు వారి రాజ్య సర్వస్వమేగాక ద్రౌపదిని కూడ యోడిపోయిరి. నీ విదేపోయి ద్రుపదరాకుమారిని జుట్టుబట్టుకొని యీడ్చుకురమ్ము.

దుశ్శా:- మాటలతో రాకయున్న మరిజుట్టుబట్టియే యీడ్చుకవత్తును.
(నిష్క్రమించును)

(ధృతరాష్ట్రుడు, భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, వికర్ణులు ప్రవేశింతురు)

ధర్మ:- పూజ్యులందరకు పాండవులు నమస్కరించుచున్నారు.

ధృత:- మీకు జయంబగుగాక,

దుర్యో:- జయమగుగాక. జూదమున మాకే దిగ్విజయమైనది. మయ సభా సమేతంబుగ నింద్రప్రస్థంబు మా కధీనమైనది. పాంచాలి మా దాసియైనది, దానినిప్పుడే వస్త్రాపహరణంబుజేసి పరాభ వింప నిందురావింప నెంచినాడ.

ధృత- నాయనా! నీకతండ్రి బిడ్డలనిట్లు చేయవచ్చునా?

దుర్యో- మయసభలో నన్ను పరాభవించు నపుడీ పాండవులకు నేను పెత్తండ్రి బిడ్డను కాకబోయితినా?

భీష్మ- నీకు వైరమున్న సోదర ద్వేష మీ పాండవులపై చూపుము కాని ఆడుదానిని మానభంగము చేయుట తగదు.

దుర్యో- ఆడుదియైపుట్టిన పాంచాలి మగరాయుడువోలె మయసభలో నన్ను పరాభవించి నందులకు దానికా బరాభవము జరిగి తీర వలయు,

విక- అది ఉత్తమధర్మము కాదు.

కర్ణ- ఓయీ! వికర్ణా! నీవుగూడ ధర్మము లుపదేశింప వలయునా?

గీ॥ వర్ణధర్మంబు ముఖ్యమై వరలుగాన,
పగరశిక్షించుటయె రాచపాడియగును.
పరువువీడి నృపతి నవమాన పరచు
సతివ నేమిచేసిన పాపమంటగలదె.

( దుశ్శాసనుడు ద్రౌపది కొప్పుబట్టుకొని యీడ్చుకొని వచ్చును )

ద్రౌపది- మరదీ! ఇదిధర్మము కాదు,

దుశ్శా- ఆ ధర్మాధర్మ నిర్ణయములు తరువాత గాని ముందురమ్మ

దుర్యో- (పరిహాసముగ)ఓహో హో! మహారాణీ దేవిగారా!
మా సభకు దయ చేసినారే !

ద్రౌప- సుయోధనా ! నన్నేల నిందు రావించితివి ?

దుర్యో- అది నీకింకను తెలియలేదా!

గీ. ధర్మజుడు, తమ్ములను, ధరణిగూడ
పణముగా నాడి, యోడి నా వంతుజేసె
దాసిగా నిన్ను జూడంగ ధర్మమగున
రాణి! నాతొడ నెక్కంగ రమ్ము నేగ

(అని తొడ జూపించును.)

భీము- (కోపముతో) ఆఁ! పాపీ ఏమని పేలితివిరా ?

మ. కపటద్యూతమునందు మమ్ము గెలువంగా జాలినా వెట్లొ ? యీ
ద్రుపదేంద్రాత్మజ నీపతివ్రతనిటుల్ దుష్కామివై బిల్చినా
వె, పటుత్వంబున మద్గదాప్రహతిచే వేగంబు నీయంక మీ
నృపులున్ జూడగ ద్రెంతుసంగరమునన్ నిక్కంబు దుర్మార్గుడా!

ధర్మ- తమ్ముడా శాంతింపుము ఇది సమయముకాదు.

ద్రౌప- అయ్యలారా మహనీయులారా వారింపుడు. నన్ను రక్షిం పుడు. మీరందరు పుణ్యమూర్తులు ధర్మవేత్తలు న్యాయ మెరింగింపరా? మీయందరకునావంటియాడువారుతో బుట్టువులు లేరా ? ఈదుర్మార్గులు సేయుచున్న దురంతరములకునివార ణోపాయములేదా ?

గీ. ఆడుదాన నేకాంబరమందున్న
దాన ఆపదనందున్న దాన కట్టు
పుట్టము లొలువనున్న యీమూఢులకిక
బుద్ధిసెప్పి నన్ బ్రోవుడో పెద్దలార !

దుర్యో- ఓసీ! కులటా! ఇందు నిను బ్రోచు పెద్దలుండెనా ? ఎవరా పెద్దలు? మయసభలో నాడు నన్నుచూచి నవ్విననాడీ పెద్దలు నీవద్దనుండిన్యాయములు చెప్పలేదేమి? దుశ్శాసనా ఈపాంచాలి నాదాసి. ఈదుర్మార్గురాలు మున్ను నన్ను పరాభవించిన కారణమున రాజాజ్ఞ తృణీకరించి. నాయాన యైనతోడనే యిందురాకున్న హేతువునను దీనికి వస్త్రాపహరణ శిక్షవిధించు చున్నాను, అవశ్యమాచరింపుము. ఇదినీకు అన్నయాజ్ఞయేగాక రాజాజ్ఞకూడ.

దుశ్శా- ఓసీ, దుర్మార్గురాలా! కురుపతి నెదిరించి నిన్ను కాచు వారుండిరే! సభామధ్యంబునకు రాక నింకనూ తొలిగియుందు వేల? (అని కొప్పుబట్టిలాగును.)

భీము:- (రోషముతో) ఏమిరా! దుర్మార్గా!

చ, పరసతి కొప్పుబట్టుక సభాస్థలినీడ్చిన దుర్మదాంధ! నిన్ దురమునబట్టి గుండియల తుత్తునియల్ మరిజేసివెచ్చ నె త్తురు కడుపార ద్రావక యె తొల్లిటికైవడి సైపబోవనే హరిహరులడ్డమైన. మనుజాధిపులందరు నేకమైననున్

ధర్మ- (పట్టుకొని) సోదరా! పౌరుషంబున కిది సమయంబుగాదు శాంతింపుము,

దుశ్శా- ద్రౌపదీ! రాజాధికారంబుగ నీవస్త్రంబులను విప్పనిమ్ము (ద్రౌపదిమేని చీరెను లాగును)

ద్రౌప- హా కృష్ణా! దీనశరణ్యా!

చ, కురుపతిదుర్మదాంధుడయి కోకలనూడ్చుచునుండె.భర్తలే పురు నిట బొమ్మలై తలలు వంచిరి. పెద్దలమాట చెల్ల దీ తరుణమునందు వస్త్రముల దాన మొనర్చి కృపాత్మనాపయిన్ బరువుము నిన్నె నమ్మితిని వారిజనాభ నమస్కరించితిన్.

(దుశ్శాసనుడు చీరవిప్పగా మరల ద్రౌపది శరీరముమీద చీరవుండును,)

ధృత- సుయోధనా! ఇంక నీయాగడము చాలింపుము. ఇందు నేను నిందింపబడుచుంటిని. ఎటులన ? పెత్తండ్రియగు ధృతరాష్ట్రుడే కపటాలోచనపరుడై పాండవులను చూచుటకను మిషమీద హస్తినకు రావించి జూదంబున తమ్మునిబిడ్డల రిగంపదలు హరించుటయేగాక నవమానపరచెనన్న దుష్కీర్తి రాగలదు కావున దీనిని నేను సహింపను.

దుర్యో- తండ్రీ! మీ కంతటి దుష్కీర్తియేల రావలయును ? అటులైననింతకుముందు మేముగెల్చుకొన్నసర్వస్వము తిరిగిధర్మజునకు యుచితంబుగానే యొసంగెదను, వాటింగైకొని యీ పెద్దలందరి సమక్షంబున మరల జూదమాడి జయింపుమనుడు.

గీ. పుష్కరము వనవాసంబు పూని వత్స
రంబు దనుక నజ్ఞాత వాసంబు జరిపి
వచ్చుటయొ, జూదమందోడువారు. గెలుగు
వారికిచ్చు పందెంబగు వేరుగాక.

భీష్మ:-ధర్మనందనా ! సుయోధనుండిందు మహోదారమును రాజ ధర్మమును చూపినాడు. నీ వేమందువు?

ధర్మ- మీయభిలాషను నిరాకరింతునా?

దుర్యో-ధర్మరాజా! మరల వినుము

గీ శకుని మామయే నాదుపక్షము వహించు
కడమ మాయజూద మటంచు గడవబోకు
సందియంబున్న మనుముందె సావధాన
మగ నెరింగి పిమ్మట పందెమునకురమ్మ

ధర్మ:—మరేమియును సందియము లేదు, ఇవిగో పాచికలు వేయు చున్నాను. (పందెము వేయును)

శకు;— ధర్మజా! ఇదిగో ధర్మము జయించినది. ఈసందెముగూడ దుర్యోధనుండె గెలుచుకొనెనుగదా? మీరింక పన్నెండేండ్లు వనవాసంబును నొకవత్సరము నజ్ఞాతవాసంబు చేయవలయును,

ధర్మ—చిత్తము.

(శ్రీకృష్ణుడు ప్రవేశించును, పాండవులు తలలు వంచుకొందురు.)

ద్రౌప;— అన్నా ! యదునందనా ! వచ్చితివా:

శ్రీకృ —అమ్మా! సమయము మించిన పిమ్మట నేను మాత్రమేమి చేయుదును? ధర్మమునకు బద్ధుడై జూదంబున చేసిన నొడంబడిక చెల్లింపక నొప్పునా? బావలారా విచారపడకుడు కష్టంబులు కలకాలముండ నేరవు ధర్మనందనా! గడచిన దానికై విచారింప కుము. అర్జునా!

గీ. బాలుడభిమన్యుడౌట సుభద్రతోడ
వనుల కాపురముంట దుర్భరము నౌను
ద్వారకకు చెల్లి గొంబోవ దలచినాడ
యిష్టమైన దెల్పుము నీయభీష్టమేమొ?

ధర్మ— తమ్ముడా! వనవాసాజ్ఞాత వాసంబులు పాంచాలీ సమేతంబుగ మనకేగాని సుభద్రాదులకు గాదుగదా? అంగీకరించుము,

అర్జు— బావా! వాసుదేవా! నీమాట నే నెన్నడేనియు జవదాటితినే! అటులే గావింపుము.

శ్రీకృ— సరియే, అటులేగావింపుము.

గీ, పదియు మూడేళ్ళు మీ యొడంబడికను
పూర్తి చేసుకురండు అప్పుడు సుయోధ
నుండు ధరనిచ్చినా మేలు మొండియైన
నాటికి ర్తవ్యమేదియో నాడెకలదు.

భీష్మ- పాండవులారా! ధర్మస్వరూపుండైన దామోదరుని సంభావణ సమంజసముగనున్నది, మీరిక పోయిరండు,

ధర్మ- పూజ్యులారా! మీ యందరకు నమస్కరించుచున్నాను,

గీ॥ జూదమున యొడంబడినట్టి సూక్తికొరకు
పోయివచ్చెద మిదె మేము పూజ్యులెల్ల
మమ్ము దీవించి పంపుడో మాన్యులార!
వందనముసేతు మీకెల్ల భక్తిమీర.

(తెరజారును)

# కురుక్షేత్రము

## చతుర్థాంకము

### సైన్యవిభాగము

(ద్వారకాపురసమీపమున అర్జునుడు ప్రవేశము)

అర్జునుడు— ఆహా !

మ. అదిగో ద్వారక; గోగణంబునదిగో; ఆనంద మింపొందున
య్యదియే కోట రథప్రకాండ మదిగో, ఆ దేవకీసూతి స
మ్మదమొప్పన్వసియించుసౌధమదిగో, పుణ్యాత్ముడై నట్టియా
యదుసింహున్ దరిశింతుభక్తిమెయి నే నాప్యాయచిత్తంబునన్

నాడు కురుసభలో ధర్మజుండాడిన మాయ దారిజూద మొడంబడిక ననుసరించి ద్వాదశవర్షంబు లరణ్యవాసంబును నొక వత్సర మజ్ఞాత వాసంబు గావించి పిమ్మట మా రాజ్యమిమ్మని యడిగిన దుర్యోధను డంగీకరింపక సంజయు రాయబారమున వానియభిప్రాయ మెరింగించెను గదా? నేనిదేపోయి నాకాప్తుడయిన శ్రీకృష్ణునితో కర్తవ్య మాలోచించెదనుగాక. (అని రెండడుగులు వేయును వెనుక శ్రీకృష్ణుడుశయనించియుండును. దుర్యోధనుడు తలవైపునకూర్చుండి యుండును.)

ఓహో ! దుర్యోధన చక్రవర్తియా ?

చ. కురుపతి ముందుగానిచట కూర్చునియుండె. ఘటింపనున్న సం
గరమున వాసుదేవ సహాకారముగై కొన నెంచియేమొ ? తా
నరయడు పాండుపుత్రులకు నాప్తుడు మాధవుడన్నమాట; దు
శ్చరితుడునోట మాట హరిసాయము దూరముసేయు బుద్ధియై

శ్రీకృ— (మేల్కాంచి, లేచి అర్జునునిచూచి) అర్జునా ! ఎప్పుడువచ్చితివయ్యా ! నేను చూడనేలేదు.

గీ. నీవు, నీ సహోదరులు, పునీతురాలు
ద్రుపదపుత్రియు క్షేమమే? ధూర్తులైన
పగర దుష్కృత్యములకు లోబడక సౌఖ్య
మై వెలంగుదురే దెల్పుమయ్య పార్థ!

అర్జు:- మీ దయవలన నేమందరము క్షేమముగ నున్నారము దేవా

శ్రీకృ:- (వెనుకనున్న దుర్యోధనుని చూచి) ఓ హాహా హా! నీవును వచ్చితివా? మరి పలుకరింపకుంటి వేమి?

శా. క్షేమంబేగదనీవు; సోదరులు, వా సింగన్న భీష్ముండు, నీ
సేమంబారయు కర్ణ, ద్రోణ, గురువుల్ సేవించు భృత్యాదులున్
మీమీ వారలు హాయినుండిరే? నృపా! మేలొప్ప నీవిందు ర
నేమో దెల్పుము సావధానముగ నీ కేలా వృథా జాలమున్?

దుర్యో:- బావా! నేను వచ్చుసరికే నీవు నిద్రయందుంట చే మేల్కొలుపనిచ్చ లేక కూర్చుంటిని. హాస్తినాపురంబున మేమంద రము క్షేమముగ నేయుంటిమి. ఇక నేను వచ్చినపని యందువా?

ఉ. కౌరవపాండ వేయ; చిరకాల వివాదము నీ వెరుంగ నే
నూరక చెప్ప నేల? యిపుడో సమరం బొదవంగనుండెడ; నీ
వారయ రెండుపక్షముల కైన మహోత్తమ బంధువౌట నీ
కూరిమిఁగోరి వచ్చితి ముకుంద ముదంబున పద్మలోచనా!

శ్రీకృ:- అటులనా? విన నెంతయు సంతోషము. కాని కురుకంఠీరవా! రెండుపక్షములకు నేనుత్తమబంధువు నన్న మాట నీవే యంటివి గదా? వినవ్వుడు నేను మీ యిరువురకు నుపకారము చేయ దగినవాడను.

దుర్యో:- అటులనే కానిమ్ము.

శ్రీకృ:- నేనొక్కండను మీయిరుపక్షంబుల సహాకరించుట సంభవము కాదు గాన నాపరివారంబగు పదివేలగోపకు లొక భాగంబును నేనొకండ నొక భాగంబున నుందుము. మరియు వారు రణ మొనరింతురు- నేనునాకు వీలగు సహాయము మాత్రమే సేయు దును. సుయోధనా! భాగము లిట్లు తేలిపోయినవిగదా? మరి పాలుపంచుకొను ... ముందు ఫల్గుణు డేది కోరునో మిగిలిన దానిని నీవు గ్రహింపుము.

దుర్యో:- కృష్ణా ఇది న్యాయమా? ముందుగ నేను వచ్చితిని. నాకు కాదగిన సహాయంబున వానికి పాలొసంగుట కొంతదనుకనొప్పి

గీ॥ గోపవీరులు శాత్రవకోటిసపండి
పోరుచుండ నాసైన్యంబు పుడమివాళ్లు
మాధవుండు నా దరినుండి మార్గమెల్ల
చెప్పవచ్చును పాండవసేనలకును

అనిదలంచె : సిరాచక్రీయధురంధరుడైన యీచక్రిలేకముండదు గిరి లేని పాండవమధ్యముండతని నే కోరుకొంటిమె (ప్ర)కాశముగ బావా! అర్జునుండు కోరుకొనగ మిగిలిన నీవది వేల గోపవీరులు నాపక్షము వాలేగదా?

శ్రీకృ;— రాజరాజా! అందులకు సందియమా?

గీ॥ నాదు లోపమింతయు లేక న్యాయమరసి
తేట తెల్లముగ నిజంబుదెలిపినాడ!
అతడు ననుగోరెగాన సైన్యంబులెల్ల
నీవెనయ్యా! కౌరవనాథ నిక్కముగ

దుర్యో;—అట్లైన నేనింక పోయివత్తునా?

శ్రీకృ:— మంచిది పోయిరమ్ము.

(దుర్యోధనుడు నిష్క్రమించును)

శ్రీకృ;— అర్జునా! ఎంత పొరపాటుపని చేసితివి? నీకంటె దుర్యోధనుండె ధన్యుడయ్యెను గదా?

గీ॥ శరము బట్టనివాడ నేచందమునను
సాయమొనరింతునో సవ్యసాచి!
గోపవీరుల పాలుగా గొనెనుగాదె
కరివురాధీశు డౌర నిష్కారణముగ

అర్జు:— బావా! ఇది నేమి? నీవే నాకు సర్వస్వము, నీసహాయమున్న నీకౌరవేశ్వరుడేగాదు—ముక్కోటీశ్వరుండెదురైనను జడియువాడనుగాను

శ్రీకృ:— అర్జునా! నీభక్తివిశ్వాసంబులకు మెచ్చితిని.

గీ॥ గోపవీరులు శాత్రవకోటినపుండి
పోరుచుండ నా సైన్యంబు పుడమివాలు
మాధవుండు నా దరినుండి మార్గమెల్ల
చెప్పవచ్చును పాండవసేనలకును

అనిదలంచె సిరాచక్రీయధురంధరుడైన యీచక్రిలేకముందడుగిడలేని పాండవమధ్యముండతని నే కోరుకొనియె (ప్ర)కాశముగ బావా! అర్జునుండు కోరుకొనగ మిగిలిన నీపదివేల గోపవీరులు నాపక్షమువారేగదా?

శ్రీకృ:— రాజరాజా! అందులకు సందియమా?

గీ॥ నాదు లోపమింతయు లేక న్యాయమరసి
తేట తెల్లముగ నిజంబు దెలిపినాడ!
అతడు ననుగోరెగాన సైన్యంబులెల్ల
నీవెనయ్య! కౌరవనాథ నిక్కువముగ

దుర్యో:— అట్లైన నేనింక పోయివత్తును?

శ్రీకృ:— మంచిది పోయిరమ్ము.

(దుర్యోధనుడు నిష్క్రమించును)

శ్రీకృ:— అర్జునా! ఎంత పొరపాటుపని చేసితివి? నీకంటె దుర్యోధనుండె ధన్యుడయ్యెను గదా?

గీ॥ శరము బట్టనివాడ నేచందమునను
సాయమొనరింతునో సవ్యసాచి!
గోపవీరుల పాలుగా గొనెనుగాదె
కరివురాధీశు డౌర నిష్కారణముగ

అర్జు:— బావా! ఏననేమి? నీవే నాకు సర్వస్వము, నీసహాయమున్న నీకౌరవేశ్వరుడేగాదు—ముక్కోటీశ్వరులు డెదురైనను జడియువాడనుగాను

శ్రీకృ:— అర్జునా! నీభక్తివిశ్వాసంబులకు మెచ్చితిని.

ఉ. కౌరవనాథునిన్ వగిది గర్వమనస్కుడ వీవుగాక న
న్నే రథమందు నిల్వుమనియెంతయు కోరుకతాన నేను పొం
గారగ పార్థసారథియటన్న యశంబు ధరింపబూని నీ
తేరువుదోలువాడ రణధీరులు భీరులు గాగ నర్జునా!

అర్జు:— ఆహా! ఏమీ నాభాగ్యము?

గీ॥ కనక గర్భునిబొడ్డున గన్నవాడు,
వక్షమందు రమాదేవి వరలువాడు,
నాకు సారథి యానట నాదు పూర్వ
జన్మసుకృత పున్నెంపు చందమేమొ!

శ్రీకృ:— ధనంజయా! మనమింకను కొన్ని విషయంబులు మాటలాడ
వలయునుగాన లోపలకు బోవుదము రమ్ము.

అర్జు:— దేవా! అటులనే కానిండు

[తెరజారును

# కురుక్షేత్రము

## చతుర్థాంకము

### సైన్యవిభాగము

(ద్వారకాపురసమీపమున అర్జునుడు ప్రవేశము)

అర్జునుడు— ఆహా !

మ. అదిగో ద్వారక: గోగణంబులవిగో; ఆనందమింపొందున
య్యాదియే కోట రథప్రకాండ మదిగో, ఆ దేవకీసూతి స
మ్మోద మొప్పన్ వసియించు సౌధమదిగో, పుణ్యాత్ములైనట్టియా
యదుసింహులన్ దరిశింతుభక్తి మెయినే నాప్యాయచిత్తంబునన్

నాడు కురుసభలో ధర్మజుండాడిన మాయదారిజూద యొడంబడిక ననుసరించి ద్వాదశవర్షంబు లరణ్యవాసంబును నొక వత్సర మజ్ఞాతవాసంబు గావించి పిమ్మట మా రాజ్యమిమ్మని యడిగిన దుర్యోధనుం డంగీకరింపక సంజయ రాయబారమున వానియభిప్రాయ మెరింగించెను గదా? నేనిదే పోయి నాకాప్తుడయిన శ్రీకృష్ణునితో కర్తవ్య మాలోచించెదనుగాక. (అని రెండడుగులు వేయును వెనుక శ్రీకృష్ణుడు శయనించియుండును. దుర్యోధనుడు తలవైపున కూర్చుండి యుండును.)

ఓహో ! దుర్యోధన చక్రవర్తియా ?

చ. కురుపతి ముందుగా నిచట గూర్చునియుండె. ఘటింపనున్న సం
గరమున వాసుదేవ సహకారము గైకొన నెంచియేమొ ? తా
నరయడు పాండుపుత్రులకు నాప్తుడు మాధవుడన్న మాట; దు
శ్చరితుడు నోట మాకు హరిసాయము దూరము సేయు బుద్ధియై

శ్రీకృ— (మేల్కాంచి, లేచి అర్జుననుచూచి) అర్జునా ! ఎప్పుడువచ్చితివయ్యా ! నేను చూడనేలేదు.

గీ. నీవు, నీ సహోదరులు, పునీతురాలు
ద్రుపదపుత్రియు క్షేమమే? ధూర్తులైన
పగర దుష్కృత్యములకు లోబడక సౌఖ్య
మై చెలంగుదురే దెల్పుమయ్యా పార్థ!

గలము! మీకు మేనమామ బిడ్డడై చెలికాడై అన్నివిధంబుల మిమ్మనుసరించుకొని కాపాడుచున్న కేశవుం డాడినచలోక్తుల కే యింతపౌరుషమా

సహ:— చిన్నన్నా ! ఇది యేమిమర్యాద !

మ. హితుడై బంధువునై చిరంజీవము తానెంతేని ప్రాల్మాల కే
అతివాత్సల్యంబును కాచుచుండె. అతడీ హాస్యోక్తులాడంగనీ
గతి? శాంతంబినుమంత లేక పలుకంగా బాడియే? దేవకీ
సుతుడెద్దాన సుయోధనున్ గనుటయో! సుంతైన యోచింపవే

అర్జు:— అన్నా భీమసేనా వాసుదేవుండు పాండవ పక్షపాతిగాదా? సుభద్రను నాకిచ్చునప్పుడేమి. ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమం దేమి. రాజసూయయాగ నిర్వహణ కార్యదీక్షయం దేమి వనవాసంబుననున్నపుడేమి. తిరిగి శశిరేకాభిమన్యుల కల్యాణమం దేమి నారాయణుండు మనకు చేసినయుపకారంబులమరువగలమా! అంతయేల ఇంతకుముందు నేనీ యదుకుంజరుని సహాయము పేక్షించిపోవునరి కేదుర్యోధనుండరుదెంచికూర్చుండి యుండెనను కొండొక కారణంబున నాకందుపాలును గల్పించుచు తా నేగాకనీమహామహుని సహాయమంతయుమన కేలభించునట్లు చేయలేదా? నేడీహస్తినాపురిప్రయాణంబును మనకొరకుంగాక తనకొరకు చేయుచుండెనా?

భీము:— ఏమీ నాకంటెను పిన్నవారు హాకు నీతులు చెప్పుచుండిరే ఛి ఛీ! ఆడుదానిచేతను మాటలుబడిన యీభీముడింక జీవింపనేల! ఓగదాదండమా!,

గీ. నాడు సభలోన ప్రతిన లొనర్చినాడ
వాని చెల్లింపనేరని వాడనైతి
ఇట్టి నాశిరచ్ఛేదనమిపుడె జేసి
సార్థకంబందు మింక విస్పందియముగ

(అని గద నెత్తి కొట్టుకొనబోవును)

ధర్మ:— హాయనందనా! శాంతింపుము. శాంతింపుము. వృధాగా నీప్రాణంబుల నేలపోగొట్టుకొనవలయును దీనికంతకు కారణము నేను గదా? ఆగదాదండముచే నామస్తకంబునే దెగవేయుదువేని

మీ యందరియిక్కట్టులు నిక్కువంబుగ దీరిపోగలవు. (భీముని గద తీసికొని) గదాదండమా!

గీ॥ మాయజూదమునందు సమస్తమోడి
యింతజేసిన నికృష్టుఁ డితఁడుగాన,
వీనిజంపుట భావ్యమై వెలయుఁగాని
నిరపరాధుల దండింప నరుగనేల?

(అనిగదనెత్తి కొట్టుకొనబోవును)

శ్రీకృ;- (వారించి) ధర్మసంభవా! ఏమిది? నీవును యింతటి చికాకు నొందుచుంటివా? భీమసేనా యేమీనీ వెఱ్ఱి? మీసహోదరుని పని మేలమాడితినేగాని నిక్కువంబునను నీ దైర్యసాహసంబులు నేనెరుంగనివా? ఈలోకమెరుంగనివా? అంతయేల? రేపు జరుగనున్న మహాభారత సంగ్రామంబున నీవు చేయు నేనెరుగనా?

ఉ. అలకురురాజ పెండొడలు నాహవమందున గొట్టకుండ, దు
ఖలుఁడగు దుస్ససేనుని నఖంబులఁజీల్చియు రక్తధారలన్
న్నులగనకుండ, ద్రౌపదికి న్యాయతదీరునె? నీ ప్రతిజ్ఞలున్
ఫలములగాంచునే? పగఅపాయము లేనెరకపోవ జాలునే?

ఇప్పుడీసంధి కేనియు నా సోదరేయులు సమ్మతింతురని నేను జెప్పుచుంటినా? లేదు. లేదు, పాండవులాయుద్ధంబు ధరించువరకును చెప్పి చూచిరను మాటనిలుపుకొనుటకే గాని, నెరుగరా.

శా, గాంధారేయులు సంధి కిష్టపడరా కయత్నంబులో నీవిటుల్
సంధింపన్ దగు కాలమున్నది (హస్తినాపాలసంస్థానమున్
అంధుండా ధృతరాష్ట్రు) భూరమణి ఉల్లాసంగ వీక్షించు నా
బంధుశ్రేణి ఖలీయటంచు మిము నేఁ బల్కంగ నాలింపనే?

భీము;- ఆ విషయంబు నేను నెరుగుదును కావుననే నాసోదరేయుల పట్లగల సహజపౌరుషంబేనియు లేక శాంతంబున బల్కితిని.

శ్రీకృ;- ఔను బావా! అందులకేగదా నేను హాస్యములాడితిని! సరికాని ధనంజయా! సంధివచనంబుగ నీయభిప్రాయ మేమైన నున్న సెలవింతువా?

అర్జు:- కృష్ణా! నీకు తెలియనిదేమున్నదని నేనునచింతును. విననునామాటగా వినదలంతువేని యిటువినుము

గీ॥ అన్నదమ్ముల బిడ్డలమైన కతన
కయ్యమాడుట దేమి శ్రేయంబుగాదు
దాయలందు మాత్సర్యంబు తగదుగాన
పోరుసేయుట తగని వ్యాపారమనుము,

ఉ, సోదరమైత్రిచే మనము శూరతమించిన వైరులెవ్వరేన్
పాదము పెట్టజాలరు స్వపాలనమా సరిహద్దులందు; బల్
మోదముతో కుటుంబమున పొందభివృద్ధియు, గాక వేరుగా
వాదనకుం గడంగ పెరవారలు తేలికచూపుచూడరే?

కావున నష్టదాయకంబగు పోరుకంటె లాభదాయకంబగు పొందౌన గూర్పుమని వచింపుము.

శ్రీకృ:- బావా! నకులా! నీ యభిప్రాయమేమి?

నకు:- వాసుదేవా!

గీ। జూదమున నొడంబడినట్టి సూక్తి నెరిగి
పాండవుల వంతు చెల్లించి వచ్చినారు,
కౌరవులవంతు చెల్లించ గలిగెనేని
సర్వజనులు సుఖించుట సత్యమనుము
అందుకు ముఖ్యముగ మాపెదతండ్రిగారితో

ఉ. తమ్మునిబిడ్డలైన పరతత్త్వములేకనె పెంచినావు ని
క్కమ్ముగ నేడు వారలకు కయ్యము గల్గినయేని రెండు ప
క్షమ్ములనేరికే దొసగుగల్గిన నీకువిచారమాట స
త్యమ్ముగదా? పురంబు విడితప్పకసంధి యొనర్ప బల్కుమా!

శ్రీకృ:- చిన్నిబావా! సహదేవా! నీవుచెప్పదగినదున్న చెప్పుము.

సహ:- మహాత్మా! చెప్పమంటిరిగాన చెప్పెదను,

ఉ. అన్నలు పెద్దవారు సుగుణాత్ములు చెప్పగలట్టి మాటలే
మున్నవా చెప్పినారు, సమయోచిత పాండితిగల్గునీవు మే

లెన్నగ దూతకృత్యము వహించునో వేరుగ నే వచింప నే
మున్నది పద్మనాభ! విజయోన్నతిమాకు లభింపజేయుమా!
గీ। రాజ్యకాంక్షయే రాజధర్మంబుగాన
శాత్రవులు సంధికొప్పని క్షణమునందు
రణమొనర్చుటే పాడియై గ్రాలు మనకు
అద్ది చెప్పుమచ్చోట సత్యంబుగానె
సంగరంబుననింకజయాపజయంబులందు రా?అవిదైవాధీనంబులు
గీ॥ గెలుతుమా నేల నేలుకోగలము మేము
చత్తుమా వీరస్వర్గాన సౌఖ్యపడెద
మంతియేకాని, వేరుకార్యంబు లేదు.
ఇది యదార్థమంటి మదనజనక

శ్రీకృ;— మాద్రేయా! చగకుగవకాంక్షించితివి. అమ్మా! ద్రౌపదీ నిన్నుగూడ అడుగవలసిన ధర్మంబుగావ నడుగుచున్నాను; మీ పెద్దమామగారితోగాని మీరు పెద్దత్తగారితోగాని నేమైన చెప్పుమందువా!

ద్రౌపది;— అన్నా అంతఃపురంబునకేగుచో మాయత్తగారలకేగాక భానుమతిమున్నగుతోడుకోడండ్ర క్షేమంబులన్నియువిచారించి రమ్ము అంతకంటె నాడుదానవగు నేనేమిచెప్పుదును? ఐనను పురుషులరాచకార్యములలో నేనుపనిగల్పించుట ధర్మముకాదు గదా? ఆయా కార్యములన్నియు నీవే పూర్తిచేయవలయునని యీ చెల్లెలి ప్రార్థన

శ్రీకృ;— తల్లి! నీ నీతిని నీవు కాపాడుకొంటివి, నీకు శుభంబగుకాక. బావలారా! నాకింక సెలవొసంగెదరా?

ధర్మ:— కృష్ణా! కార్యసాధనకై నిన్నంపవలసివచ్చినదికాని
మ॥ పరువున్ కీర్తిలేని కౌరవులు నాపాపాత్ము లేమైన నీ
సరసోక్తుల్ విని సైపలేక మరియేచందాన కీడెంతురో
సరసీజాక్ష! అదేఘటించిన దయాస్వాతుండవై వారలన్
కరుణన్ జూడుమటంచువేడితి నమస్కారంబు గావించుచు

శ్రీకృ:- బావా! నిజముగ నీవజాతశత్రువువేనయ్యా! వారు నన్నేమియు చేయజాలరు. ఒకవేళ వారాయత్న మొనర్చినను నేను నిర్విఘ్నముగ సమర్థించుకొందును, నీవేమియు భయమందకుము

గీ॥ ఇంత చేయు దాయాదులం దింతశ్రద్ధ
నీకుగల్గెనుగాని కన్పింపదెందు
నీదుధర్మగుణమే ముందునిన్నుగాచు
ధర్మపుత్ర! విచారంబు తలుపకయ్య,
నేనింకబోయి వచ్చెదను—

(తెరబడును)



# కురుక్షేత్రము

## షష్ఠాంకము

### రాయబారము

(హస్తినాపురమున, ధృతరాష్ట్రుడు, గాంధారి, విదురుడు, ద్రోణుడు, అశ్వత్థామ భీష్ముడు వికర్ణుడు కర్ణుడు దుర్యోధనుడు దుశ్శాసనుడు శ్రీకృష్ణుడు నుండగ తెరలేచును.)

శ్రీకృ— మామా! ధృతరాష్ట్ర మహీపాలా!

గీ॥ దూతకృత్యముబూని పొందునొనరింప
వచ్చినాడనో ధృతరాష్ట్ర వసుమతీశ!
పాండవ కురువంశాల సంప్రాప్తమైన
పోరు నడగింపగా నీవె పూనుకొనుమ!

ధృత— వాసుదేవా! నాకు కౌరవులొక్కటియును పాండవులొక్కటియునా? నే నేనాడయినను వారిని వేరుగా చూచితినా? కాని ఆ సోదరులలో మాత్ర మీమైత్రి యెంతమాత్రంబును పొసంగక పరస్పర కలహంబులతోడనే కాలముబుచ్చుచువచ్చిరి. ఐనను నాశక్తికొలందికొంతదనుక చెప్పుచునేయుంటిని. మరల నీవును నీ బావమరందితో తగినంత విశ్రాంతిగ మాటాడుము. యుద్ధముపసంహార మగుటయే నా యభిసంధికూడను.

శ్రీకృ— మామా! చెప్పదగునంతవరకు సుయోధనునితో చెప్పి చూచితిమి. నీ విందు ప్రత్యేకభారము వహింపకున్న నావయి కార్యము మీరిరాగలదు. సమయముమించిన పిమ్మట యెవరేమనుకొన్నను వచ్చెడు ప్రయోజన మొక్కింతయు నుండదు,

ఉ॥ చెల్లిరొ చెల్లకో తొలుతచేసినచేతలు మాసిపోయె మీ
రెల్లరువాటినిన్ దడువభావ్యముగాదు వినూత్న కార్యమం

దల్లన సంధిసేయుటకునై యిటువచ్చితి దూతనంచు నా
చల్లనినాల్గుమాటలు ప్రశాంతముగావిని పొందుసేయుడీ!

యిపుడా పాండవులుకోరిన కోరికేనియు సమంజసముగ నేయున్నది,

గీ. అర్ధరాజ్యమొసంగుట న్యాయమనిరి.
కాదయేని, యైదూళ్ళు మా కైదుగురకు
నిమ్మనిరి యీతరుణమందు నెట్టులైన
సంధిజేసి గాపాడుమీ సర్వజనుల

మీరే విధంబున నేని సంధికియొడంబడకయున్న యుద్ధంబు సిద్ధంబగు అందు పాండవులు జయించుటయు యదార్థంబు ఇంతకుముందు రారాజపార్థులు నా సహాయ మపేక్షించినపుడు నే నర్జునకొసంగి నమాట చొప్పున ధనంజయుని సారథినై వచ్చుటయు సత్యము.

కం. జండాపై కపిరాజు పా
ర్థుండు రథంబందునుండి దురమున మిమ్మున్
చెండాడుచుండు తరి నో
క్కండును నిన్నుజూడ బోరు కౌరవనాథా!

మరియొకరహస్యమును చెప్పుచున్నాను,

చ. అలిగియొరుంగ డాతడు గదాయని యెంచితిరే మొకాని; ఆ
యలుగని ధర్మసంభవుడు నాగ్రహమే వహియింప, పర్వతం
బులయిన బద్దలై పగిలిపోవె? ధరాతలమెల్ల తల్లక్రిం
దులుగ భ్రమింపదే? పగరదోర్బలమంత నడంగిపోవదే?

పాండవులే జయింతురని నేనింత నిశ్చయముగ జెప్పుటకును తగిన కారణము లేకపోలేదు, అదెద్దియందువేని?

ఉ. లోకమునందు పాండవులలో దొసగింతయు లేదటంచు ను
శ్లోకులునైరి: వారు రణశూరులెగాక సధర్మలోలు రం
చీకరణిన్ యశంబుగని రెంతయు ధర్మముగల్గు చోటనే
నీకురుగా జయంబనుచు చెప్పరె పెద్దలు — మీరెరుంగరే?

ఆకారణంబున,

కం, తనయుడు వినెనా? సరియే:
వినకున్నచో నీవునైన వేగిరపడి, యీ

పని నెఱవేర్చుట మేలగు
ననిదెల్పుచునుంటి నుంటినయ్యా నృపాలా!

దుర్యో:- (రహస్యముగ) అంగరాజా! దూతకృత్యము నిర్వర్తింప వచ్చిన యీ జానార్దనుం డధిక ప్రసంగము సేయ నారంభించెను గదా! ఇపుడేమిచేయుదము?

కర్ణు:- రాయబారిపై రోషముచూపుట రాచధర్మము కాని మాట యదార్థమే కాని, అధిక ప్రసంగమునకు మాత్రము మందలింప వచ్చును, (శ్రీకృష్ణునితో) వసుదేవకుమారా! రాయబారివై వచ్చితివిగాన పాండవ గం దేశ మేదియో విన్పింపుము—కౌరవ సమాధానము గ్రహింపుడు, కానినీవన్య ప్రసంగంబులుసేయుట కిది సమయంబుగాదు. ఒకవేళ బాంధవ్య ధర్మంబును పురస్కరించుకొని రాజరాజుతోగాని మరెవ్వరితోగాని ప్రత్యేకంబున నీయిచ్చవచ్చినంతసేపు సంభాషింపుము,

ఉ, ఎంతటి బంధువైనను మరెంతటి మిత్రుడవైన భూరి భూ
కాంతుడవైనగాని మితిగావచియింపుము దూతవౌట: నీ
యంతటివారికీ పగిది న్యాయముగాదని చెప్పవచ్చినన్
చింతిలుచుంటి నీసరణి చెల్లదు నీ విషయంబు నందునన్.

భీష్మ:- సూతకుమారా! మాధవుని వచనంబు లప్రస్తుతంబులే యగుగాక ధర్మాధర్మ నిర్ణయ సమర్థతగల్గిన మేమును కర్తవ్య మెరింగించవలసినసుయోధనుండును, బాధ్యతాయుతుడై సధృతరాష్ట్రుండునుమిన్నకుండ వారిజనాభ హితోక్తులవారించుటకు నీకేమి యధికారముగలదు

గీ, అతడు మహాత్ముడౌ యదార్థమైన
చరిత చెప్పంగబూనె సంగరముమాన్పి
ప్రాణములనిల్పు కార్యంబువట్ల సేయు
తప్పు తప్పుగాదది మేటి మెప్పు గాక

దుర్యో:- తాతా! యుద్ధంబున జయలక్ష్మి యెవరిని వరించునో చెప్పుటదుస్సాధ్యంబుఉభయపక్షంబులవారునువారే జయింతు

మని దలంచుటయు సహజంబు అందొకపక్షంబున నున్న వారు ప్రతిపక్షమువారి సమక్షంబున మీరు నశింతురనిరణవీరులనిరుత్సాహపరచుట దూష్యంబు అందవసరమైనవారు మాటాడకున్న మరొకరైనను సత్యంబును వెల్లడించుట ధర్మముగాదా? అదియునుంగాక నీ కర్ణుండు ధర్మాధర్మ నిర్ణయాధికారము లేనివాడెట్లగును,

గీ. అంగరాజ్యమేలెడు రేడు న్యాయవాది
దానధర్మంబులుగల యుదారగుణుడు
పెద్దతలలెల్ల వాలినవేళ నొకడె
నిలిచిబల్కె ధైర్యంబున నిజమదేమొ?

అశ్వ— ఓయీ! మూఢదుర్యోధనా! ఇందున్న ద్రోణ, భీష్మ, విదుర వికర్ణాదులందరికంటె యీ కర్ణుడు నీకధికుండయ్యెనుగా? ఈ సూతపుత్రునిమాటగాని నీకు వేదసూక్తిగా లేదా?

దుర్యో- ఆచార్యపుత్రా ! అనవసరావేదన నొందుచుంటివిసుమా! గుణముకన్న కులమే ప్రధానమంటివా ? అటులైన నీనందనందనుండును శూద్రకులజుండేయగుజుమీ,

ఉ, గొల్లల యింటిలో పెరిగి గొల్ల లతాంగుల పొందుచేసి తా
గొల్లడనంగ పేర్వడయు గొల్లడు శూద్రునికన్న మిన్న యే?
గొల్లని పల్కు వేదమునకుం సరివచ్చిననాడు సూతుడున్
చెల్లకబోడు ధర్మమునుచెప్పగ సర్హుడు కాకయుండునే?

అశ్వ:- ఓయీ ! అంధరాకుమారా! పరాత్పరుండగు శ్రీకృష్ణునే సూతుండనియు, ధర్మోపన్యాసంబున కనర్హుండనియువర్ణించుచుంటివిగా? దుర్మదాంధా? హరిద్వేషవచనంబులిందున్న మహనీయులు సైరింతురని దలంచితివా యేమి ?

శా, కన్నన్ మిన్నుగాన కీకరణి వర్ణించినావౌర? లే
నాన్నా! పోదమురమ్ము యుద్ధమునభూకాంతుండె ముందింకనా
పన్నుండై రణమాడరమ్మనుచు తా ప్రార్థించునో వారలే
తన్నుంగొల్వగవత్తు రేల మనమీ దౌర్భాగ్య సర్థింపగా ?

దుర్యో:— అశ్వద్ధామా ! ఇది కొలువుకూటంబుగాని. రణకూటము గాదు, జరుగుచున్న విషయంబేమి ? నీవుచూపు రౌద్రావేశ

మేమి? నాయందనుగ్రహముంచియీ వృధాకలహంబు నుపశ
మింపచేయుము నమస్కరించెద.

కర్ణు:— సుయోధనా! విప్రుండని నమస్కరించినను, గురుపుత్రుండని
వందనంబిడిననుమంచిదేకాని తోలిగిపొమ్మెడివారిని రణంబున
సహాయంబు సేయుమని మాత్రము ప్రార్థింపకుము.

చ. జడియక యుద్ధభూమి భుజదర్పము మీరగనిల్చి; శాత్రవుల్
మడియగ పోరొనర్చుటో మరి మారణమంది త్రివిష్టపంబునన్
కడుసుఖమందుటో వొకంటియేగాక, రణంబునందెటుల్
జడియుట నూతనందనుని జన్మము నందేపు దుండ నేర్చునే!
ఆదియునుంగాక.

శా. ఏ రాజన్యుడు సర్వకాలము ముదంబేపార పోషించెనో
ఆ రాజన్యు నధర్మమార్గమున దుష్టాత్ముండిటుల్ వచ్చి తా
నీరీతిన్ వలుకాడుచుండ వినువాడీ కర్ణుడా? కాదు—యీ
రారాజున్ విడిపోవు కుత్రటతనమీ రాధాసుతుండొప్పునే?
వేయేల? నామాటవినుము

శా. నానేస్తంబుఘటించి, నన్ గనిన భూనాథుండె నాబంధువౌ
నేనా రేనికినై తపింతు బ్రతుకేనిన్ మృత్యువేవచ్చినన్
రానీ; నీవెనువెంటనిల్చి, మరి సంగ్రామంబులో బోరగా
నేనున్నాడ సుయోధనా, భయపడన్ నీ కేలనిక్కంబుగన్

ద్రోణు:— ఓయీ! కర్ణా! సుయోధనునితో నీవు వచింపదగు మాట
లివియేనా? పొందొనరింప మేమందరము యత్నించుచుండ
పోరొనరింపుమని చెప్పుటయేనా నీ ధర్మము

ఉ. వారును వారుసోదరులువారికి మధ్యను నీవుచేరి యీ
పోరున కారణంబయిన మూర్ఖుడ! నీ వొకపక్షమందునన్
జేరగనెంచి, సంగరము సేయుమటంచును బల్కితౌర! సం
సారము పాడుసేయుటకు సంకరమైతివిగాదె స్వార్థుడా!

కర్ణు:— గురూత్తమా! పొరబడుచున్నారు. చెప్పుడుమాటలకు చెవియొగ్గు
టకు రారాజవివేకికాడు. తనరాజేంద్రుడు నన్యులు లోకువసేయు
నపుడుతగదనివారించుటమిత్రధర్మముబోనిమ్ము. దుర్యోధనునితో
నేను నుడివినమాటలు మీయందరి సముఖంబున బల్కితినిగాని

రహస్యంబుగ చెప్పలేదుగదా? పరులమాటచేతనే మనసులు మార్చుకొనువారై నమీారందరునాహితమాలకింపవచ్చునుగద అదియునుగాక మీారు మాత్రముసంధిరయొనర్పుమని చెప్పుచునే యుంటిరిగదా? అట్టియెడ మీారూరకున్న దేమి? నేను చెప్పిన దేమి?

శ్రీకృ:— రాధేయా! నీ సంభాషణ మిగుల యుక్తియుక్తముగ నున్నది. ద్రోణాశ్వత్థామాది మహానీయులారా! ఇంక మీా వైరంబులు చాలింపుడు. ఏనను యిందును గురించి మీారివు డింత వివాదపడనేల?

మ. కురురాజిప్పుడు సూతనందను నెబల్ కూర్మిన్విలోకించె ని
త్తరుణంబందున రాజరాజుపయి వాత్సల్యంబు జూపించె మీా
రురుకంగాబనియేమి? యిష్టమగునా యుద్ధంబునన్ రేనికై
ధరబోరాడుడు — లేద వీడిచనుడే ధర్మంబు నిక్కంబుగన్.

సరికాని, మామా! నేనువచ్చి చాలాసేపైనది. ఇంతవఱకు ప్రధానాం శంబులేమియు జరుగలేదు. మరి నీ తమ్ముని బిడ్డలతో నేమి చెప్ప మందువో దెల్పుము. నేనింక బోయివచ్చెదను.

ధృత:— నాయనా! సత్యాపతీ! నీయెదుటనే వానికిం జెప్పెద కూర్చుం డుము. తండ్రీ! సుయోధనా! ఇటురమ్ము.

దుర్యో:— (సమీాంచి) ఏమిటి తండ్రీ!

ధృత:— నాయనా! నీకు తెలియని దేయున్నది? పాండవులైదూళ్ళిచ్చిన చాలునని వాసుదేవునితో కబురంపిరిగదా?

శ్రీకృ:— ఔను బావా!

గీ. అర్ధరాజ్యమిచ్చినమేలు, అటులకాద?
ఐదుగురకైదు నూళ్ళివ్వ నదియుచాలు
రెండిటికిగూడ కాదన్న భండనంబె
సిద్ధమని పాండవేయులు చెప్పుమనిరి.

దుర్యో:— అటులైన వారికైదూళ్ళు కాదుగదా సూదిమొన మోపి నంత భూమినయిన నివ్వను—ఏలనన?

గీ॥ ఇలసగంబా? నూళ్ళైదుయో నివ్వకున్న
యుద్ధమొనరింతుమని వారలుచ్చరింప

ధరయొసంగుట వారికి దడిచినట్లై
శూరులెవ్వరో అదియు నే చూచువాడ?

ధృత:— నాయనా! అన్నదమ్ములపిల్లలలో యీచిన్నమాటలకు పట్టింపు పెట్టుకొన జెల్లునా! సుయోధనా! నీవు చక్రవర్తివి. వారికై దూ ళ్ళిచ్చిన నీకువచ్చు లోపములేదు. అన్నదమ్ములందరును కలిసి రాజ్యంబును సురక్షితముగ నేలుకొనుటయే న్యాయము.

దుర్యో:— తండ్రీ! న్యాయమునునాకు చెప్పవచ్చినచో నిజమైన న్యాయ మేదియో నేనువచించెదవినుండు. రాజ్యమును పంచుకొనుటనగ ప్రజలను పంచుకొనుటయేగదా? రాజ్యాంగ చట్టంబున పెద్ద కుమారుడేరాజ్యమేలవయును సోదరులెందరున్నను తిని తిరుగు టకుదప్పరాజ్యమునుపంచుమనుట కధికారములేదు. ఏకారణం బునన్నైన పెద్దవాడు పంచి యిచ్చిన యివ్వవచ్చునుగాని వాని యిష్టంబులేని దేయివ్వమనినిర్బంధించుటకు వీలులేదు. ఒకప్పుడు రాజు అవివాహితుడై సంతాన విహీనుడైనచో నారాజ్యము వానిసోదరునకురావచ్చును. గాని ోడు సంతానవంతుడైనచో నా సింహాసనము మరల పెద్దకుమారునకే చెందుచుండును. మహాజనులారా! రాజధర్మాధికారంబుగ జ్యేష్ఠుడగు నాతండ్రి దీ రాజ్యము ఆయన సంతానవంతుడై యుండగ పాండురాజు సింహాసనాధికారికాజాలడు. ధృతరాష్ట్రుడు జాత్యంధుడగుటచే పాండుభూపతిరాజప్రతినిధియయ్యెనేగాని రాజు కాజాలడు కాడు

గీ|| రాజభక్తి సోదరభక్తి గ్రాలు కతన
పాండుభూపతి ధర్మమై పాటుబడియె
అట్టి సోదరుండు గతింప నతని సుతుల
భేదమేలేక పెంచె నీ పెద్దతండ్రి

బాల్యదశగతించిబోయినది. నాతండ్రిగారు "సుయోధనా! పాండ వులు తండ్రిలేని బిడ్డలు వారి నన్యాయము చేయజాలను వారి కేదేని యొసంగుమని దెలుప నేనంత కొంత దనుక యోచించి పితృవాక్పరి పాలనాసక్తిచేగాని సోదరవాత్సల్యమునగాని యింద్రప్రస్థపురంబును పాలించుకొమ్మంటినిగాదా? నాడా యింద్రప్రస్థంబును పాండవులైదు

గురుసు నైదు భాగంబులుగ నేలపంచుకొనలేదు?— ధర్మజుండొక్కడే రాజ్యమేల నేల అందున జ్యేష్ఠుడొక్కడే పాలనాధికారియనియు మిగిలినవారు కారనియు తెలిసినదిగదా?అట్టి పాండవులు నారాజ్యంబులో తమతండ్రికి భాగమున్నదని వార్తమానమంపుటలో నీతియున్నదా?

గీ॥ ఇంద్రప్రస్థము నా దేవు రేలబోక
ధర్మజుండొక్క డేలిన ధర్మమేమి?
హాస్తినాపురమందు మాకర్థపాల
టంచు వార్తనంపుటలోని న్యాయమేమి?

కావున నీరారాజుపాండవుల మాయోపాయంబులకులోబడిగాని వారికి రాజ్యాధికారమున్నదనిగానిఅంగీకరించిసూదిమొనమోపినంతయు నొసంగడు ఇది నిశ్చయంబగు

ఆ, వె, అర్థరాజ్యమేల నధికారమేయున్న
కడగి యూళ్ళునైదు నడుగనేల?
అని యొనర్చ సిద్ధమైనవారలపొందు
సేయనేల? ధరణి నీయనేల?

విదు:— సుయోధనా! పాండవుల పక్షంబున మేము నిన్నర్థించెదము సకలజననాశనకారణంబైన సంగ్రామంబు రాకుండ నారాజ్యమేదియో మాకొసంగి ప్రజలను కాపాడుము,

దుర్యో:- విదురా! ప్రజలను కావాడుకొమ్మని మాటమాటకు చెప్పుచున్నారు. నాపౌజలపై నాకు వైరంబులేదు. వైరుల దురాగతంబునుసైరింపలేని ప్రజలు ప్రభుభక్తి చూపింతురు — లేదా తొలిగిబోవుదురు కాని ప్రజాసంరక్షణమనియు పొందుసేయుమనియునాకు ధర్మములుచెప్పవచ్చిన పెద్దలందరాపాండవులతో మీ తండ్రి రాజప్రతినిధియేగాని రాజుగాదు రాజ్యము పెద్దకుటుంబములోని దగుటచే అడుగుటకు మీకధికారంబులేదు, యుద్ధమొనరించుట మీ రధర్మమునకు గడంగుటని చెప్పి యీ సమరము నేల మాన్పరాదు?

సీ. పినతండ్రి బిడ్డలు బెదరింప నేడెట్లొ
ఐదూళ్ళతో రణమాపగలను

ఇది పాటుగా నెంచి యింకొకనాడైన
అర్థపాలడుగ నీయంగవలదె
ఆపైన సామ్రాజ్యమంతయు మాతండ్రి
గడియించెనన్న నా కార్యమేమి
మేము మేమునుగూడి మెడపట్లతో నుండ?
చూచువారికి నెంత చులకదనము ?

గీ. పాండవాగ్రజుండన ధర్మపరుడనంద్రు
ధర్మశీలున కిదియెట్లు దారియయ్యె
భాగమేలేసి పెత్తండ్రి వసుధలోన
పాలుకలదంచు పోరుటే భావ్యమేమొ ?

విదురా! రాజ్యము మేమర్థించితి మనుకొమ్మని బల్కితివిగదా! దాని కేమి? మీకు నొసంగిన నాకువచ్చునష్టమేమి? మింత్రుండగురాధేయున కంగరాజ్య మొసంగినటులే మీకును యొసంగెద.

గీ, పాండవులకనిగాక మీ స్వార్థమునకు
యేమి కావలెనో కోరు డిచ్చువాడ
నీవా ? కృష్ణుడా ? భీష్ముడా ? నేల నిమ్మ
నంగ సంతసంబున మీకొసంగె దిపుడె.

అంతియేగాని, పాండవులను గురించి మాత్ర మడుగరాదు — మీరడిగినను నే నివ్వబోను;

ధృత;— సుయోధనా! పెంచినవాడగుటచే నా శ్రద్ధలు తీరిపోకున్నవి నాకు మీరిరువురు రెండు నేత్రములవంటివారు. నీ వనట్లు పాండవులదే తప్పగుగాక, వారు నాతమ్ముని తనయులగుటం జేసి వాటిని మాటిమాటికి తలపెట్టకు నాయనా! ఎట్లైనను నా తమ్ముని బిడ్డలకు దారి చూపుము తండ్రీ!

దుర్యో— నాన్నగారూ ! మీకోరిక నేను కాదనను ఐదూళ్ళ కర్మమేమి? అర్ధరాజ్యమే యొసంగెదను, లేదా! వారినే గొనివచ్చి యీ హస్తినాపురసింహాసనమున గూర్చుండబెట్టి వారి పాదంబులపూజించెదను. నిక్కంబుగా నీతమ్ముని సంతతి యీ పాండవులలోనున్నచో నొక్కని పేరు చెప్పుము.

గీ. యమసుతుండు ధర్మజుడయ్యె అనిలసుతుడు

భీముడు, ధనంజయుండు నా వేల్పు రేని
పట్టి అశ్వినీదేవులవలన గలిగె
నకుల సహదేవు లిద్దరు న్యాయమెంచ

ఇందు నీతమ్ముండగు పాండురాజనందనుండెవ్వడు ? ఎవ్వరికని నేను ధరనీయవలయును?

ధృత— దేవీ! గాంధారీ! కుమారుండెంతకూ వినడయ్యె. నేమిసేయుదును.

గాంధా— నాయనా ! సుయోధనా ! కీచకుడు . జరాసంధుడు బకాసురుడు, నీవు భీముడునొక సమయంబుననే జన్మించితిరి. అందులో మీలో నొకండెవరి చేతిలోమడియుదురో మిగిలినవారునువాని చేతిలో నేగతింతురు. ఆ కారణంబున భారత సంగ్రామారంభమనుచున్నప్పుడెల్లయు నీప్రాణంబులా వాయుపుత్రుని చేతిలో బోవునని యేదలంచి నేనుచింతించుచుంటిని .అందుల కనుగుణ్యాంబుగ ద్రౌపదీ వస్త్రాపహరణసందర్భముననా ధర్మరాజానుజుడు చేసిన ప్రతిజ్ఞలునుకూడివచ్చుచున్నవి, కావునప్రాణాపాయకరంబగు సమరంబుకూడదు వీటెనన్నింటెనియెరుంగుటచేత నేవాసుదేవుడేగాక మేమందరము యుద్ధంబున పాండవులే జయింతురని నిశ్చయింతిమి. తండ్రీ ! సంధి పొసగించి సమరము లేకుండ జేయుము నాయనా!

దుర్యో;— అమ్మా! అటులైన మీరందరు నిందు పొరబడుచున్నారు, ఎటులాదు రేని యిటువినుడు,

గీ. మరణమేనాటికిని రాక మానునొక్కొ?
భయమునొందిన మృత్యువు బాయునొక్కొ
పుట్టువారలు గిట్టక పోవునొక్కొ
అంత మాత్రమున కిదేల నపయశంబు

ఒక వేళ నాకా భీముని చేతిలోనే మరణంబు తప్పనిసరియైన నీ సంధి కుదిరినను నాకు మృత్యువు తప్పునా ? అట్టిచో

గీ. భీమునకు జంకి. రాజు సంగ్రామమేని
సలుపబోక; యెట్టులో చేసె సంధియనుచు
పదుగు రాడిపోయరె ? నన్ను పరువులేని
వానిగ బ్రతుకు మనుటెంత పాడియగునె!

పోనీ అటులేనియు కలకాలము జీవింతుమా ?

ఉ. ఎందరు రాజులేలి, రికనెందరు నేలగ నుండిరీధరన్
సందియమేమి ఎప్పటికి చాపకతప్పనె రేవి మాపో యీ
బొంది గతింపనున్నదిట ముఖ్యము కీర్తియెగాని. వేరుగా
దందున పాండునందనుల నాహవమం దెదిరించి తీరుదున్,

అదియునుగాక కురుపాండవవంశంబుల కాజన్మవైరంబులుగలవు అవి మాటలతో మాసిపోవునవిగావు మరతుమన్నను మరవు రానివట్లు మిమ్మా నందపరచుటకై లేనిమమకారము నెందుకుకొని తెచ్చుకొందుము.

గాంధా— వారు నీకేమి యుపకారంబులు చేసిరి నాయనా,

దుర్యో— కావలసినన్ని చేసినారు. చెప్పు మందురా ; మా తండ్రి శత్రురాజుల జయించకున్నపరరాజులెవ్వడో యీగ్రుడ్డిరాజును చంపిరాజ్యమాక్రమింపరా యని పలుమారులుపరిహాస మాడినారు. ఏమి! రాజప్రతినిధిరాజక్షేమము రాజ్యక్షేమము కోరడా కోరకయున్న తానేల పాండురాజుచేసినది ప్రతినిధి కార్యము కంటె నతిశయమేమైననున్నదా తరువాత ద్రోణాచార్యుండు మాకందరకును గురుచంద్రులుగదా. మా యందు పక్షపాతము చూపువనియేమి. వారిని జేరిమాశిష్యులందరికంటే నన్ను మిన్నగ జేయుమని కోరినారు. వారుచేయు కపటాలోచనలకు మేమే దేనియు కొంచెము యిట్టియన నదిగోరంతలు కొండంతలుచేసి చాటినారు. అంతియేనా? రాజసూయము జేసిరాజులందరిమన్ననలుపొంది నాపై దండెత్తయత్నించిన కృతఘ్నులు.మయసభలో నన్ను పరాభవించిన గర్వాంధులు ఇప్పటికినికుట్రతలంపులతో రాయబారమంపిన మాయామాంత్రికులు వారితో నాకుమైత్రి వలదు. కృష్ణుండింక నిర్విచారముగ బోవచ్చును యుద్ధమునకు సిద్ధము గావచ్చును.

శ్రీకృ— సరియె రాజరాజా ! నేనింకబోయివచ్చెదను—కడసారిమాట లాలకింపుము ఏమందువేని ?

ఉ, మంచియు చెడ్డలేమొ అనుమానములేక వచించినాడనీ
వించుక నాలకింప వికయేగెడువాడ రణప్రయత్నమే

కొంచెము లోటులేక నొనగూర్చుకొనుండిక మృత్యుదేవి మీ
వంచను కాచుకొన్నది కవచ్చెనులే తమకీ వినాశముల్
(దుర్యోధన కర్ణులు కృష్ణుని బంధింపచూచు చుందురు - కృష్ణు
డదిగమనించి, లేచి.)

బావా! రాజరాజా! నిజమాడిన నిష్ఠురమనినట్లు నీ భవిష్య
ముపదేశించుటచే నన్ను గట్టివైవచూచితివా! ఎంతటి వీరుడవు బావా!

క, చిక్కితి నీ కొల్వున నే
దిక్కొకింతయును లేని దీనుడనై నీ
కిక్కడ దక్కితినయ్యా!
యెక్కడి కెటుబోగలాడ నేనిక బావా?

మహాజనులారా! హితము చెప్పవచ్చిననన్నీతండు బంధింపబూనె
కావున నే నిదే విశ్వరూపంబు చూపించుచున్నాను. సత్యవతీపౌత్రా
నీకును దివ్యదృష్టి ప్రసాదించితిని; తేరిపార చూడుము,
ధృత- దేవదేవా!

మ: అవలోకించితి విశ్వరూపమును ధన్యంబయ్యె జన్మంబు, నా
భవబంధంబులు దీరిపోయె నిక సంప్రాప్తంబుగానున్న నీ
పవరంబందున యెట్టిపాపములు గన్పట్టన్ విలోకింతునో
భువినంధత్వమె నాకొసంగుమిదియే ప్రొక్కుల్ సమర్పించెదన్

అందరు:-ధన్యోస్మి—ధన్యోస్మి
శ్రీకృ-మీయందరకు మరల దృష్టిని తొలగించుచున్నాను
అందరు-ధన్యులమైతిమి
శ్రీకృ -సభాసదులారా

ఉ. వచ్చినకార్యమెల్ల పెడబాటలబట్టి సుయోధనుండు నా
ముచ్చట లాలకింప డికముందు రణంబె స్థిరంబునయ్యె శ్రీ
యిచ్చకొలంది మీరు వహియింపు కార్యమునందుపోయి నే
వచ్చెద ద్వారకాపురికి పాండవులచ్చట నుందురిప్పుడున్

రాధేయా నీతో కొన్ని విషయంబు లేకాంతంబుగ మాటలాడ
దలంచితిని. ఏమందువు
కర్ణ!-దానికేమి మాటలాడవచ్చును.

గీ. మిత్రుడైన లేక పరమశత్రువైన
దరికిరాగ మాటాడుట ధర్మమండ్రు
మాటలాడిన మాట సమ్మతమొ? కాదొ
యనునదాప్పైని చర్చనీయంబు గాదె.

శ్రీకృ- కర్ణా! అటులైన రమ్ము, బావా! రాజరాజా! నే నింకబోయి వచ్చెదను, మహాజనులారా! నాకింక శెలవు.

గీ. విల్లు బూనియు మాపాండవేయు లిపుడు
సంధిపొసగునేమొ యటన్న సంబరమున
చూచినార లీ కడసారి చూపుగూడ
తప్పు లేదింక మా పాండుతనయులందు,

నేనింక పోయివచ్చెదను —

[తెరవ్రాలును]



# కురుక్షేత్రము

## [ సప్తమాంకము ]

### కర్ణసందేశము

(పురబాహ్యప్రదేశము. కర్ణుడు-కృష్ణుడు ప్రవేశింతురు)

గీ. కుంతిభోజుని ముద్దుల కూతురైన
కుంతియే నిన్ను గన్నట్టి కాంతగాని
నీవు రాధేయుడవు గావు నే నెరుంగు
ప్రభాకరు డెరుగు యథార్థమెల్ల

చ. అదియొక పూర్వగాథ; జలాజాప్తుని సత్కృపచేత కుంతియే
ముదమున నిన్నుగన్నగతమున్ వివరించెద నీకు పాండవుల్
విదితముగా సహోదరులు పెద్దమరందివినాకు. నీకు ప్రదా
పది నిజమాడగా మరదలౌను, సుయోధనుడే విరోధియౌ
ఈమాటలు నీకంతగ నమ్మకము లేదనిచో రవిచేతను; నినుగన్న!
కుంతి చేతను గూడ నిజంబని బల్కింతును

కర్ణు:- కేశవా! నీవంతగ శ్రమపడనక్కరలేదు, నాజన్మవృత్తాంత
మంతయు మున్నొకమారు ప్రభాకరునివలన వినియుంటిని కాని
ప్రస్తుతాంశ మేదియో వివరింపుము,

శ్రీకృ:-కౌంతేయా!

మ. కురుసంగ్రామము చేరువయ్యె: నని నీకుం కీడు చేకూరు నం
దరవిందేక్షణ కుంతి చింతపడెనయ్యా! నాదు మేనత్తకుం
వరపుత్రుండవు నౌట. నిన్ను గొనిపోవంగోరి నే తెంచితిన్
కురునాథున్ విడి పాండునందనులతో కూర్మిన్ సుఖింపన్ దగున్

కర్ణు:- అది అసంభవమైనకోరిక. యెటులందు వేని

ఉ. ఇప్పటిదాక నేనకట యెల్లరిముందున సూతునింటిలో
మెవ్వగ పెద్దవాడనయి మించిచరించిన నేను నేఁడికీ
చొప్పున రాసుతుండననుచున్ మరి చెప్పగడంగు దేని నా
గొప్ప నశించదే? ప్రజలకుం గడుచుల్కనగానె మాధవా?
అదియును గాక రాబోవు నిందయు గలదు,

ఉ. పాండవమధ్యముఁన్ సరికిపై తునటంచు నేటిదాక బల్
గండరగండడై పలుకు కర్ణుడు యుద్ధమువచ్చినంత తా
భండనమం పార్థుగెలువం భయమంచుచు తంతుజేసె కా
కుండిన కర్ణుడెట్టులకు కుంతిసుతుండని లోకమాడదే ?

శ్రీకృ:— బావా! లోకము లోకమనకుము మన శ్రేయస్కరము ననుసరించి ప్రవర్తింపవలయునుగాని కేవలము లోకముతో సంబంధము పెట్టుకొందువా ? అందులకే చతుర్విధోపాయంబులు మానవులకావశ్యంబు లనిరి నీవునామాటవిని పాండవేయులలో చేరుదువేని —

గీ. పాండుపుత్రు లార్వురను పేర్వహయగలరు:
ధర్మసంభవుండింక నీ తమ్ముడగును.
భీమ, పార్థ, కవలలును ప్రీతి నన్న
పెద్దవానిగా పూజింతు రిద్ధ నిజము.

మరియును —

ఉ. అని కురువంశమంతయును అంతమునొందగనుండె, ధర్మనం
దనుడె ధరిత్రినేలగల ధన్యుడు అతడుగూడ అన్న ! ర
మ్మని నిను రాజునిన్ సలుపు సంతట వాయుసుతుండుపార్థుడిం
క నకులుడున్ కనిష్టుడును గౌరవమొప్పగ సేవ సేయుచున్.

కర్ణా ! దూరదృష్టిని గమనించి నీవు వెంటవత్తువేని భారత యుద్ధంబున మరణంబు తప్పుటయు పాండవులచే గౌరవింపబడి కురు సామ్రాజ్యమునకు చక్రవర్తి వగుటయేగాక కొండొకలాభంబును లేక పోలేదు.

గీ. హేమమగుండానబుట్టిన యతివమిన్న
అందముల కాకరంబైన యతివమిన్న

పాండవుల ధర్మపత్నియా పడతిమిన్న
ద్రుపదజ కౌరవభర్త పగుదువయ్య!

కర్ణు— బావా! ఈ సుఖంబులు కేవలము ఐహిక వాంఛా పరులకుగాని నావంటి త్యాగమూర్తుల కిష్టంబులుగావు. మరియు ద్రౌపది నాకు భార్యయగుననియు నుపదేశించితిరి —

ఉ. జూదవుపందెమై పగులు చూచుచునుండ, వివస్త్రయైనదా
దాదినిచూచి యెందరో ముదంబున మూగిరికాదె? భర్తలా
యైదుగురన్నదమ్ములటు హానిని పొందియు రోసియుండగా
మోదముగల్గునే ద్రుపద పుత్రికపైయిది సిగ్గుచేటగున్,

ఇక రాజ్యభోగము లందువా? రారాజు నాకొసంగిన వంగ రాజ్యమునేలి రాజభోగంబుల ననుభవించితిని, కావున నాకీకామంబులతో నిమిత్తములేదు. ఒకవేళ నేనందుల కాసింతునేని —

గీ. ప్రాణమిత్రుడైన కురునృపాలకుండు
నాబలంబుచూచియె బుద్ధి నమ్మికొనియె
నొలుత తానుచేసిన మేలు దలచబోక
వీడిపోవ రారాజు నేవిషయమందు,

ఉ. వచ్చిన లేనితోడ నని చచ్చెద గెల్చిన గెల్తుగాని నే
నిచ్చకమాడి నానృపతి నీ సమయంబున మోసగింప నన్
మచ్చితుడంద్రు కౌరవులకూటికి. గుడ్డకు చేయిచాచి నా
డచ్చపుదొంగ పాండవుల నండకు జేరె నటంచు దిట్టరే?

ఉ. ఇంతటి నిందమోసి: అటులే యొనరింతమటంచు నెంచి యిం
కెంతగ ప్రాకులాడిన మరెన్నటి కీస్మృతి రాకయుండునా!
అంతటిదానికై చెడుగునై కురునాథుని వీడ నేల? నా
స్వాంతము సమ్మతింపదు నిజంబుగ నమ్ముము నందనందనా!

శ్రీకృ— పాండుపుత్రా! నీ వింతటి ధర్మనిర్ణయమొనరించి బల్కుచుంటివిగదా? మరి నిన్ను గన్న తల్లికోరిక నీవు తీర్పవలయునన్న ధర్మముమాత్ర మెఱుంగకుంటివేమి?

కర్ణు— ఆ ధర్మముమాత్రము నేను నిల్పకుంటినా?

శ్రీకృ— ఎట్లు?

కర్ణః:- మాయమ్మ నాతో మాటలాడునపుడు నాయనా! నా కొడుకు లేవురు. పాండవులైదుగురనుమాటకు లోపము రానీయకుమని కోరినది. నే నటులేనని వాగ్దాన మొనరించితిని. దాని కింకెవ్వ డును మార్పరాదు,

గీ॥ పార్థుడొక్కడె నాకు దీటు వచ్చువాడు;
వానిజంపుదు ? వానిచే నేను సమటో?
కాక, మిగిలినవార లా కదనమందు
చిక్కువడినగాని, దునుమ నిక్కువముగ.

ఆకారణంబున నేనుమడియుదునా పాండ వేయులుపాండ వేయులు గనే యుందురు, నా చేతిలో నర్జునుండే మరణించిన నాతోడ పాండవు లైదుగురగుదురు. ఆమె యడిగినటు పాండవులెప్పుడు నైదుగురేకాని, ఆర్వురు కాజాలరు.

శ్రీకృ:- కర్ణా! తల్లికి పుత్రుడు చెప్పదగిన సమాధానమిదియేనా? ఎచ్చటనుండినను యింతదనుక సౌఖ్యముగ నుండుటచే నిన్ను గన్నతల్లిచూచి యూరుకున్నది, కాని యిపుడు సంగ్రామమా రంభమగుటచే కుంతీదేవి నీకై యెంత పరితపించుచున్నదో యెఱుంగుదువా?

కర్ణః:- ఎరుగ కేమి బాగుగా నెరుంగుదును, నాయందా మెకుగలపుత్ర వాత్సల్యమెట్టిదియో యెరుంగవలయునన్న ఆనాడు నన్ను గంగ పాలుచేసిన విషయంబు దృష్టాంతముగాదా?

శ్రీకృ:- బావా! అటులనరాదు. నాడు కుంతీదేవి యెట్టి యిక్కట్టులకు లోనగుటచే అట్లుచేయవలసివచ్చెనో నీవెరుంగవు. ఆసమయం బున మాత్రము నీతల్లిబడిన మనోవేదన నీవేమెరుంగుదువు?

కర్ణః:- కృష్ణా! ఎందుల కీమాయలు బల్కెదవు? తన కంత కష్టమైనచో నేదాసీలకిచ్చిననన్ను పెంచుకొనరు? మరేదూర దేశంబులనుంచి పోషింపరాదు? పుట్టినపురిటి బిడ్డను చేతులార గంగ కర్పించిన తల్లికి మాతృహృదయమా? కర్ణుడానాడు నీటిలోనే చనిపోయె ననుకొనక మరల నన్నేలరద్ది చేయవలయును?

శా॥ ఏనాడో తనయుండు గాడనుచు నన్నే గంగపాల్జేసె? నే
నానాడే మరణించినాడననుకొన్నన్ బాడియౌగాని, తా

నీనాఁడీ కపటాదరంబాదవిన క్రైబల్కు ధర్మంబె? యే
మైన్ నాఁడెగతించె నేఁడిటులిదేలా: లేని వాత్సల్యముల్?

శ్రీకృ— అటులైన కౌరవులతో గూడి గతించుటకే నిశ్చయించితివా?

కర్ణ— ఐనను నాకు విచారము లేదని చెప్పితినిగదా?

శ్రీకృ— సరియే ఇఁక నీయిష్టము.

గీ, ఆరయమేనత్త బిడ్డడవైన కతన
చిత్తమందుంచి యింతగా చెప్పినాఁడ
వినకయున్న తప్పింతునే వివిధగతుల
పాటుబడియైన మృత్యువు వాతబడక

అదియునుగాక—

చ, సమరముసేయుపట్ల రథచక్రము భూమినిగ్రుంగు విద్య యా
సమయమునన్ వృథాయగును శాపములున్నకతానయింద్రుడున్
కొమరునిగాన నీకవచకుండలములన్ హరియించెబాపడౌచునో
కమలహితాత్మజా! జయము గాంతువె? నీకిక శక్తియున్నదే?
కావున నీవింకవృథాప్రయాస బడనేల? రమ్మునావెంట.

కర్ణ— కృష్ణా! ఇవియన్నియునాకు తెలియనివికావు ధీరులుకంఠమున ప్రాణములున్నంతవరకు స్వధర్మ పరిపాలనంబున వెనుకాడరు, విప్రశాపంబు లమోఘంబులుగదా? నేను నీచెప్పిన చొప్పున పాండవులలోచేరి కౌరవులతో పోరాడినను నారథచక్రంబు నేల గ్రుంగవలసినదే యగును, అట్టియెడ పార్థునితోడ పోరుటయే మంచిది. అదియునుంగాక—

గీ, యుక్తియుక్తముగా నీతి సూక్తులాడి
కార్యమెట్లొ సాధించుకోగలరు మీరు
పట్టినట్టి పట్టువిడక ప్రాకులాడు
మాకుతప్పదుకీడు సమరమునందు,

కావున నేనందుల కంగీకరించియే యుంటిని

శ్రీకృ— అటులైన నీ యిష్టము.

కర్ణ— కాని మాధవా!

గీ॥ ఏను కౌంతేయుడనటంచు నీవుబోయి
పాండవులతోడ బల్కకు పద్మనాభ!
దాననెన్నియో చిక్కులు కానవచ్చు,
మనసునందుంచుకొనుమయ్య మర్మమెపుడు.

శ్రీకృ:— ఆవిషయము నాకుమాత్రము తెలియదా? పోయిరమ్ము

కర్ణు:— మంచిది.

(తెరజారును)

# అష్టమాంకము

## అభిమన్యునివధ

[ధర్మరాజు, భీముడు నకులుడు సహదేవుడు అభిమన్యుడు నిలుచుండి యుండగ తెరలేచును.

ధర్మరాజు:- అభిమన్యుకుమారా! ఇంతవరకు జరుగుచున్న కురుపాండవ సంగ్రామంబు నీకు దెలియును గదా? అందీనాడు నీసహాయ్యమెక్కింత కావలసి వచ్చినది.

గీ॥ జగతి దేవవ్రతుండంపశయ్యకరిగె,
సర్వసేనాధిపత్య మాచార్యునకిడె
రాజరాజు గురుండు సంబరమున నన్ను
బట్టి కురుపతి కివ్వంగ ప్రతినబూనె

అందులకై ద్రోణుండుపద్మవ్యూహంబునొక దానినిపన్నియుండె దానిని భేదించుమార్గంబు మీతండ్రికిందప్ప మరెవ్వరికిం దెలియదు అందు చేత నేఅర్జునుండు లేనినవకాశంబుచూచుకొనిగురుండు నేటిసాయం కాలమునకు పూర్వమే నను పట్టియిత్తునని రారాజుతో ప్రతినజేసె. ఇవుడా తమ్మి మొగ్గరంబుభేదించు మార్గంబు నీవెఱుంగుదువని పిలిపించితిని.

గీ॥ అట త్రిగర్తులపై కయ్యమాడబోయె
తండ్రియును మాయయును సుభద్రాకుమార!
సంకటంబైన సమయంబు సంభవింప
నీవు నిలుబూన వలసెగా నేటిరోజు

అభి:- పెదనాన్నగారూ! దీనికి మీరింతగ చెప్పవలయునా? నేడాచార్యుండుపన్నినతమ్మిమొగ్గరంబును భేదించకున్న పాండవుల శక్తిసామర్థ్యంబు లీపాటివాయని లోకులు పరిహాసమాడరా? ఆ పరిహాసము నాకు మాత్రము సంక్రమింపదా:

భీమ:— నాయనా! అందులకుగాదు.

గీ. పెద్దలైనవారము మేము వెనుకనుండి
పిన్నవానిని బంపుట వీరతనమె?
ఎన్నడీ వ్యూహముల నేను బన్నియెరుగ
నాకతాన నీతోడు మాకవసరంబు

అందైనను నీవు మిక్కిలి శ్రమించ నక్కరలేదు. మొగ్గరము భేదించి యించుక మార్గమొనరింతువేని నీవెంట నేను నుగ్రగదాదండధారినై జొరంబడి శత్రుసేనలనెల్ల చల్లాచదరంబు చేయకుందునా?

అభి;— అదేమి తండ్రిగారూ! నేనుమాత్రమా రణరంగంబున నిద్రబోవుదునా? పౌరుషమును మరతునా?

క. కనురెప్ప పాటుననె నే
నని జొచ్చి బలంబుమీర హత మొనరింతున్;
కని విని మునుపు నెరుంగని
ఘనచురుకులు పుట్టినేడు కరిపురపతికిన్,

పెదనాన్నగారూ! సందియమేల? జాగగుచున్నది. నేనింక బోవుదును.

ధర్మ— మంచిది, భీమసేనా! నీవుకుమారునివెంట భద్రముగ మెలంగుము

భీము— (స్వగతముగ) అకటా! ఏమీయీ యమంగళవాక్యంబులు? సౌభద్రుండు « నేను బోయివత్తును అని యనక » నేను బోవుదున » నియె అమోఘ వచనుండగు ధర్మపుత్రుడేనియు కుమారుని యమంగళమునకు ప్రతిహితమును చెప్పక మంచి దనియె ఇది యంతయును చూడ నాహృదయంబు కలవర పడుచున్నది కానిమ్ము వినను యిదిజాగొనరించుటకు సమయముగాదు, భీమ గదాధారినగు నేను కుమారున కేయాపదయు రాకుండ చూచు కొనలేక బోవుదునా? అంతయేల?

గీ. హరికి మేనల్లుడు—కిరీటి కాత్మజుండు;
దురమునందు విజృంభింప దోసగుయగునె?
భారమంతయు దైవంబుపైనె వైచి
బాలకుని గొనిపోయెద భండనమున

(ప్రకాశముగ) కుమారా పోదమురమ్ము.

అభిమన్యుడు - భీముడు నిష్క్రమింతురు.)

ధర్మ— మా(దేయులారా !

గీ. గురుని చూడభీతిలి యింటగూరుచుంటి
మిమ్ములను వెంట నుంచుకో సమ్మతంబె?
బాలునకు తోడు సేయంగ పవిరమందు
కంటికిని రెప్పకై వడి కాచుకొనుడు.

నాకు పాంచాలీశిబిరంబును చూపి మీరును రణభూమికిపొందు

నకులు- అన్నా ! మంచి యుపాయమే చెప్పితిరి,

సహ— ఓరీ బకోటకా ! నీవు మహారాజుగారి రాక (ద్రౌపది కెరిం గింపుము మేము సంపరభూమి కరుగుచున్నాము,

ధర్మ- సోదరులారా! యుద్ధవార్తలు వెంటనే కరండకునిచే నాకుం దెలియబంపుడు.

నకు.సహ — అటులనే చేయుదుము [నిష్క్రమింతురు.)

[(ద్రౌపది (ప్రవేశము)

(ద్రౌప— మహారాజా ! దయచేయుడు మీ వదనమింత కళాహీనమై యున్న దేమి ?

ధర్మ— దేవీ ! ఏమని చెప్పుదును ?

మనధనంజయుండొకమారు నేనుపద్దలేని దేసాభ(దు నెవ్వరును రణంబున కనుపరాదని నొక్కివక్కాణించె కానికొండొకకారణం బున వానిని నేడని సేయబంపక తప్పలేదు, అప్పటి నుండియు నా కేది యోభీతిగనున్నది.

(ద్రౌప— మహారాజా ! అభిమన్యుడర్జునుని కుమారుడైయుండ నన మర్థుడగునా ? ఐనను వాని వెంట ....

ధర్మ— భీమ, నకుల సహదేవులు తగుసన్నాహంబులతో కాచుకొనిరే యున్నారు. ఐనను—

ఉ. (ద్రోణునితోడ సంగరము దుస్తరమైనది. తండ్రి మేనమా
మైనను వద్దలేరు. యిక నా కురురాజతి కుచ్ఛితుండు నా
కాన మనంబునన్ భయము గల్గుచునున్నది, యెంతయోచ్చినన్
మానిని దుఃఖమే వెడలె మానసమందుదురంత లీలలన్

కరండకుడు ((ప్రవేశము)

కరం:— జయముమహారాజా! జయము.

ధర్మ:— కరండకా! రమ్ము. కుమారుని యుద్ధవార్త లేమి?

కరం;—వార్తలన్నియుదిగ్విజయము లేమహారాజా! అభిమన్యుకుమారు డందరును చూచుచుండ తమ్మిమొగ్గరంబును క్షణమాత్రమున ఛేదించుకొని సంగర భూమింజొచ్చె,

ధర్మ- శెభాషు ! కుమారా ! నీవంతటి ప్రజ్ఞాశాలివనియే నిన్నంపని కంపితిని, కరండకా ! తరువాత ? తరువాత?

కరం- మింటమండిపడు మార్తాండుని చందంబున నుద్రేకుడై కురు సేనపై కురికె.అభిమన్యుని వాడివాణంబుల కెందరెందరో వీరుల కండలు చెండబడియె — రక్తముచిందె—కరపదంబులు దెగియె ప్రాణంబులు స్వర్గపురికరిగె. ద్రోణాదులు వాని ప్రతాపంబున కాశ్చర్యమంది ,, భళిరా ! ఇతండు పార్థనందనుం డనుపించు కొనియెజుమీ” యని యచ్చెరువునొందిరి. పిమ్మట నాతండు ద్రోణునిందాకి ,, ఆచార్యా ! అర్జునుండు లేకున్న మాపెత్తం డ్రిని బట్టి కురురాజునకొప్పగింతురు గదా? మీరారాజుచూచు చుండగ నే నిన్నుబట్టి మాపెత్తండ్రిగారికి ఒప్పగించిన నీవేమి చేయగల్గుదువు ? అని బలికె,

ధర్మ- బేషుబేషు ! సౌభద్రా! అడుగదగినమాట నడిగితివి. ఇక చాలు

ద్రౌప — కరండకా ! తరువాత నేమయ్యె ?

కరం— అట్లనేకమంది హతమగుట చే కురుసేన లించుక వెనుకాడ, ఆ సమయంబున లక్ష్మణకుమారుండు సప్రయత్నంబుగవచ్చి యభి మన్యునెదుర్కొనె. మహారాజా? లక్ష్మణుండు చిరకాలంబు సౌభద్రునితో సమదీటుగ బోరాడితుదకు జీవంబులబాసె.

ధర్మ- అయ్యయ్యో ! దుర్యోధనా ? ఇప్పటికేనియు నీ మూఢతనము మారలేదుగదా!

కరం- తరువాతమరికొంత తడవాగి .... సుచిరంజీవి నెదుర్కొనియె వారిరువురు వీరరసము చిందులాడ —తండ్రులపేరు ప్రఖ్యాతు లను బేర్కొన— నొండొరుల జయించుతలంపున చేయు యుద్ధ మెంతయు ముదావహంబయ్యె. ద్రోణుండంతట సౌభద్రునిపై ననూయచూపె — కర్ణుని కన్నెఱ్ఱనయ్యె- దుశ్శాసనుండు మండి

పడియె. కురురాజేదియెూకుట్రలుపన్ను చున్నటులుదోచె. అంత నాకనుమానంబుజనించి, విశేష శాత్రవానీకంబు మధ్య బాలుం డొంటరిగ చిక్కుబడు నేమోననుభయంబుననిందు చెప్పవచ్చితిని

ద్రౌప:— బాలుం డొక్కడగు టేమి? మాద్రేయద్వయ సహితుండగు మారుతాత్మజుండు సంగరభూమిలో లేడా?

ధర్మ:— (స్వగ) కట్టా! ఏదియో కీడుమూడినటులున్నది,

కరం:— లేరు. దేవీ! భీమాదులు రణరంగమున ప్రవేశింప నే లేదు,

ధర్మ:— అదేమి?

కరం:— సౌభద్రుండు మొగ్గరమును జీల్చి ప్రవేశించినతోడనే ప్రభంజన తనూభవుండును బోయత్నించెను గాని సైంధవుండడ్డుపడియె. పిదప వచ్చినమాద్రేయులునుభీమునకు సహాయముగ సైంధవునితో బోరాడుచు నింకను మొగ్గరంబును జొచ్చరైరి,

ద్రౌప:— ఏమీ! సైంధవుడంతటి వాడయ్యెనా?

కరం:— నాడు దేవరవారిచే పరాభవింపబడినందున నాతండు శంకరుని తపంబున మెప్పించి పాండవుల నందర జయించుశక్తి నొసంగుమని కోరెనట. చంద్రశేఖరుండంతనెంతయు చింతించి పార్థుండు లేకుండ మిగిలిన నల్వుర నొక్కనాడు మాత్రము వారింప గల్గుదు వని వరం బొసంగెనట.

ద్రౌప;— ఆ దినము నేడేవచ్చినది కాబోలు.

[తెరలో నాకాశవాణి)

గీ. బాలుడభిమన్యు డొక్కడు పావులందు
చిక్కుపడె కౌరవులు తురగముల గొట్టి;
సారధినిజంపి, గుమిగూడి చంపిరకట!
కన్నసుభద్రకు గర్భశోకంబుగలుగ

ధర్మ:— హా! హతవిధీ! ఎంత ఘోరము జరిగినది? నా ప్రాణంబులను కాచుకొనుటకై పసివానిప్రాణంబులను బదులిచ్చినదుర్మార్గుడనైతినిగదా? (కౌరవుల నుద్దేశించి) ఓరోరీ! కౌరవులారా!

మ. అనిలో బాలునిచేసి మీరిటు రణన్యాయంబు బోనాడి యే
దునుమన్ జాలితిమంచు నెంచితిరి రా దుర్మార్గులారా! కుమా

రని గోల్పోయిననాకు నింక భయమారూఢన్ మిమున్ ద్రెంపనే
రణరంగంబున జొచ్చుచుంటి నిదిగో రారండు పోరాడగన్
కరండకా! ధనుర్బాణంబుల నిటు దెమ్ము.

కరం:- మహారాజా! శాంతింపుడు. మీరిపుడి బిరంబు దాటినచో వచ్చినకీడుకంటెను రానున్న ప్రమాద మధికంబు కాగలదు. (ఎదుటచూచి) అదిగో సమయంబునకు పార్థకృష్ణు లు వచ్చుచున్నారు.

(కృష్ణుడు — అర్జునుడు ప్రవేశింతురు)

అర్జు:- బావా! నాహృదయంబూరక నపశకునంబులకు గురియైనది.

సీ. వందిమాగథులు కైవారంబుల సలుప
రాకున్న యట్టి కారణమ దేమి?
సరణిదప్పక మ్రోగు జయజయధ్వనులిందు
చెవిబడకున్నట్టి చిత్రమేమి?
ఎదురేగి యుపచర్య లొదవించు భృత్యాప
ర్గము చాటులందుండు గాధయేమి?
నారాకకై వేచు నా అభిమన్యుండు
ప్రీతి నిచ్చోట గన్పింపడేమి?

గీ॥ సుంతయేని నామదికి ప్రశాంతి లేదు,
యేదియో కీడుమూడె నంచెంచె మనసు
గుండియలు బండబారె నాకొడుకుమాట
దలచుకొన్నంత నిక్కంబు దనుజవైరి!

శ్రీకృ:- బావా! నేనును నీవెంటనే యుంటినిగదా? నాకు మాత్ర మేమి తెలియును? ఇదిగోయిది ద్రౌపదీ శిబిరము. ఇం దెవరయిన నుండెనేమో విచారింతము. (తెరలోనికిచూచి) ఓరీ ఎవడురా అక్కడ?

(తెరలో):- దేవా! నేను బకోటకుడను.

శ్రీకృ:- మహారాజులు గా రెందుండెనో నీకు తెలియునా?

(తెరలో):- శిబిరము నందున్నారు మహానీయా!

(ధర్మరాజు ప్రవేశము)

ధర్మ:- వాసుదేవా! బ్రతికియు చచ్చినవానికన్న హీనమైన ధర్మజు డిందేయున్నాడు.

శ్రీకృ:- ధర్మసంభవా! నిన్ను గూర్చి నీవు నిందించుకొననేల? ఊరట నొంది యేమి జరిగినదో చెప్పుము.

అర్జు:- అన్నా! నిన్ని విచారంబునకు పాలుచేసిన యాదుర్మార్గు డెవడో చెప్పుము. వానినిప్పుడె గాండీవంబున కాహుతిగావించెద,

ధర్మ:- తమ్ముడా! ఏమని చెప్పుదును.

మ. హరియున్నీ పుత్రిగర్తులన్ గెలువకయ్యం బాడుచుండంగ నీ
గురుడున్నాకయి తమ్మిమొగ్గరము చేకూర్చెన్ గటా, దానిగ
మ్మర భేదింపగ నీ కుమారునకు పొమ్మంచున్ ప్రబోధించి ని
ర్జరలోకంబున కంపినట్టి ఖలుడన్ సత్యంబుగా తమ్ముడా!

అర్జు- (దుఃఖించుచు) హా! హా సౌభద్రా! శశిరేఖాకళత్రా! ఎంత పనిజరిగినది? ఎంతపనిజరిగినది!

సీ. ఇరువురుకోడండ్ర కిరువైన పసుపు కుం
కాల సంపద గంగపాలుజేసి;
గర్భంబునను నిన్ను గన్న సుభద్రకు
తీరనిశోకంబు మీరజేసి;
కొడుకో కొడుకొయని గొంతెత్తి నేడ్వంగ
దుఃఖమే మాకింక తోడుజేసి;
ముందుపుట్టగనున్న ముద్దులయ్యను నేడె
తండ్రిలేని సుతుని ధాత్రిజేసి;

గీ॥ పోయినాడవా సమరాన ముద్దులయ్య!
నీదు ధైర్యసాహసములు, నీదుశక్తి
నీదు రూపురేఖాభూతి నీదుప్రతిభ
కానుపించునే నాకన్నుగవకునింక.

శ్రీకృ:- అర్జునా! ఊరటనొందుము. పుట్టినవారెన్నటికేనియు గిట్టక నుందురా? కాని అకాలమరణమునకై మనము చింతింపవల యును, ఐనను నింతచిన్నవయస్సునందే మహాభారత యుద్ధవీరు డని ప్రఖ్యాతిగాంచి, పదుగురను చంపి చచ్చినవానికై అందును

రాచబిడ్డవైనందుకు రణంబున చచ్చి వీరస్వర్గమందినందులకు సంతోషింపవలయును.

క. నీకును పుత్రుండు, మరియు
నాకును మేనల్లుడౌట న్యాయముగా నీ
శోకము లేకెందు చనును?
చీకాకును చెందబోకు చిత్తమునందున్

కావున నింకధైర్యంబు బూని ముందుకర్తవ్యము చూడుము.

అర్జు:- అన్నా! కుమారునివెంట మనవారెవ్వరును బోలేదా?

ధర్మ:- అయ్యో! ఎవరును లేక పసివానిని యొంటరిగ బంపుదునా? మన భీమనకుల సహదేవ్రులరిగిరి, అందువారు పోయిన ప్రయోజనమును, నేనుపోని లోపమును సమానమైనవి.

అర్జు:- ఏమది?

ధర్మ:- ఏమున్నది? పద్మవ్యూహమును భేదించుకొని కుమారుండరిగిన మార్గమందే మనవారు బోవుచుండ సింధురాజు వారి కడ్డు వడియెనట

అర్జు:- (కోపముతో) ఔరా! సైంధవఛండాలా! ఎంతపని చేసితివిరా?

గీ॥ భానుడస్తమించకమున్నె భండనమున
నీదు మస్తకమును ద్రెంతు నిక్కువముగ
లేదయేని సందియ మింత లేక నేను
గాండివంబుతోడ నిల దగ్ధమగువాడ

శ్రీకృ:- అర్జునా! ఇంత తొందరబడి శపథంబు చేసితివేమి? సింధురాజంతటి తేలికవాడని భావించితివా యేమి?

అర్జు:- దేవా! నాకుమార మారణ కారకుడైన నా సైంధవుని హతమార్చక నా శోకదవానల కీలలు చల్లారునా? అభిమన్యమరణ వ్యాకులాయత్త చిత్తంబున నేమియో బల్కితిని. ఇవుడేమి చేయుదము?

శ్రీకృ:- చేయుట కేమున్నది? ప్రతినచేయ నేరాదుగాని చేసిన పిమ్మట చెల్లించి తీరవలసినదే పోవుదము రమ్ము.

అర్జు:— ధర్మనందనా!

గీ॥ శాత్రవుల చేతజిక్కి తాచావనున్న
వేళ యెన్నిమారులు నన్ను పిలిచెనొకద !
యెంత డస్సెనో చెప్పనే యెవ్వరైన
తనయునట చూడగా నోచుకొనకపోతి

శ్రీకృ:— అర్జునా! ఏమి నీవెర్రి? పుత్రశోకముచే నింతదనుక యేడ్చి' యేడ్చియున్న ధర్మపుత్రుని దుఃఖమును మరల రేకెత్తించు చుంటివి అభిమన్యుడా దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునాది దుష్టుల చేతిలో బడిన సమయమున వానినిచూచు భాగ్యమే నీకును గలిగిన నింతవర కేలవచ్చును? పుత్రశోకముచేతను, భర్తృశోకముచేతను విలపించుచున్న స్త్రీజనంబుల నింత యోదార్చి సైంధవసంహారమునకు బోవుదము రమ్ము.

అర్జు:— అన్నా! మాకింక సెలవొసంగుడు

ధర్మ:— మంచిది పోయిరండు

గీ॥ పుత్రఘాతకుడగు సింధుభూపతిని వ
ధించి, హృదయశాంతి నిలపుటించి విజయ
సిద్ధినివహించి తిరిగి విచ్చేయుడింక
ద్రోణునిభయంబు నాకిట్లొ తొలగిపోయె

శ్రీకృ:— అటులనే పోయివత్తుము.

(తెరబడును)

9)

# కురుక్షేత్రము

## [ నవమాంకము ]

### కర్ణవధ

ధర్మరాజు, అర్జునుడు, శ్రీకృష్ణుడు నిలుచుండియుండ తెరలేచును

ధర్మ:— సోదరా! ధనంజయా!

క. రాధేయుండు గతించిన
యోధుం డిక లేడు మనల నొప్పింపగ దు
ర్యోధనుడనంగ నెంతగు?
నీధర నార్జింప మొక్క యింకొక ఘడియన్

శ్రీకృ:— (రహస్యముగ) ధనంజయా! మనలగాంచి యుధిష్ఠిరుండు కర్ణుని దెగటార్చియే వచ్చితిమని దలంచుచుండెను గదా, మన మేమని వానికి వార్త చెప్పగలము?

అర్జు:— బావా! నేడు కర్ణుండు భండనంబున ప్రళయకాల రుద్రునింబోలి వీరవిహారము గావించెను గదా? నేడింక సంగరంబున నిల్చిన మనము జయింతుమా? దిరిగివచ్చి వీరికి వార్తనైనా చెప్పగలమా?

శ్రీకృ:— అందువలననే సమయమును తప్పించుట మేలని యొకింత విశ్రాంతికై నిన్నిటు గొనివచ్చితిని. అదుగో మీ యన్న సమీపించుచున్నాడు.

ధర్మ:— (అర్జునుని సమీపించి) తమ్ముడా! నేటి సంగరమున కర్ణుండు గతించినట్లెగదా?

ఉ. భారతయుద్ధగాధకు నెవాడు ప్రధానపు పాత్రధారి? ఆ
క్రూరుని శీర్షమున్ దునిమి కీర్తి గడించితివే ధనంజయా!
తీరెనె యుద్ధభారమిక తీరగ నున్నదె రాజరాజుతో
బోర్నొనరించు కార్యమును పూర్తియగున్ గద. నేడు—రేపటన్

అర్జు:— అన్నా! కర్ణుడింకను గతింపలేదు. మీ మాతనిపై యుద్ధంబున కేగుచు ముందుగ మిము మాని పోదలంచి యిటు వచ్చితిమి

ధర్మ:— ఏమీ! ఇంకను రాధేయుండు మడియలేదా?

ఉ. చంపుదు చంపుదేననుచు సారెకుసారెకు ప్రజ్ఞలాడి. బల్
తెంపును చూపినట్టి ఘనధీరుడ వేటికి నన్నుజూడగా
పెంపునవచ్చియుంటివి? ఇది భీరతనంబునుగాక - కర్ణునిన్
చంపగలాడవె విజయ! సార్ధకనామము గాదు నీకికన్

అర్జు:- మహారాజా! కోపగింపకుము. కర్ణుని వధింపకుండ నే నిద్రించువాడనుగాను. కాని సమయము రాకముందు యెంతతొందరబడిననేమి? దాని ముహూర్తమువచ్చువరకు వేచియుండవలదా?

ధర్మ:— ఔనులే నీయట్టి అసమర్ధునకీ వేదాంతములు తెలియక బోవునా?

క. అని గర్ణుజంపువాడవ
రన, నే నుంటినని యీవు ననుమాటలచే
నని యొనరింపగ బూనితి
కనుగొన మోసంబుసేయు గారడివకటా:

అర్జు:— అన్నా! ఎందులకు నన్ను వృధా నిందాలాపములాడెదవు?

ఉ. ఆడినమాటమీరను, యదార్ధముగా భవదీయ సోదరుం
డోడను శత్రుసేనలకు యుద్ధమునందున పట్టి చంపకే
వీడను కర్ణునిన్ నిజము, ప్రీతియు పర్ధియు నీ కొసంగకే
బోడు, మురారితోడుగల భూరిపరాక్రమశాలి గావునన్

ధర్మ:— అర్జునా! ఎందులకింకను నన్ను బొంకింతువు? నీవా కర్ణుని వధింపజాలవు—కర్ణుడంత సులభంబుగ నీచేత మడియువాడును గాడు. చంపజాలిన శౌర్యము గలవాడవేని యింతకాలము కావలయునా? ఏదీ యీ యుద్ధారంభమునుండి నీస్వశక్తిచే చంపబడిన వీరుడెవ్వడో పేరెత్తి వక్కాణింపుము

సీ. అర్ధరాత్రమునందు పతని నర్ధింపక
గాంగేయుని జయింపగల్గినావె?
అనృతంబులాడక నాచార్యునేమైన
వీరరణంబు మాన్పించినావె?

తిమిరంబు గ్రమ్మిన తీరు గల్పింపక
సైంధవుని వధింప జాలినావె?
తోయజాక్షుండు సహాయ మొనర్పక
నిల్చి యెవ్వనినైన గూల్చినావె!
గీ॥ ఒక్కడుండిన వేళ్ళపై లెక్క బెట్టి
చెప్పు మాతని బేరు నీ గొప్ప లేల?
చాలుచాలును పార్థ! నీశౌర్యపటిమ
కర్ణుని దెగ వేయుటనంగా కల్లమాట.

అర్జు:- అన్నా!

ధర్మ:- (రోషముతో) ఛీ! నీవు నాకు తమ్ముడవుగావు — నేను నీ కన్ననుగాను.

గీ॥ ధర బృహన్నల పనుమాట నెరిగికూడ
నేటికిని మోసపోయితి నిన్ను నమ్మి,
యింతయైన నిజము వచియింతు వేని
పోవుదును వనసీమ కీ పోరుమాని

మ. హరిసారథ్యము నీకతంబున వృథాయయ్యెన్ గదా యింకనా
పరువున్ గిరితి గంగలోకలిసె నీపార్థోత్తుచేష్టన్ గటా
భరతోర్వీతలమందు వీరులకు సంప్రాప్తించె దుష్కీర్తి నీ
దుర మేలా? మరిప్రజ్ఞలేల పరుషోక్తుల్ బల్క బోకింకిటన్
అర్జునా! జరిగిపోయిత దేదియో జరిగిపోయినది.

గీ. దురమునందు రథంబిక తోలుమీవు
కృష్ణుడేనిల్చి వైరుల గీటడంచు
చేతగాక నీ యభిమాన చేత మేల
కమలనాభునకిమ్ము నీ గాండీవమ్ము.

అర్జు:— (రోషముతో) ఆ! ఏమంటి వేమంటివి.

ఉ. గాండివ మివ్వుమన్నతరికంతముగోసెదనంచు మున్ను న
ద్దండతబల్కి యుంటిగద దాని నెరింగియు నిట్టులాడె నీ
తండికన్నగాడు.... మరితమ్ముడగాను ప్రతిజ్ఞ దీర్ప నే
ఖండున జేతు మీనితల గ్రమ్మర నేలబడంగ నిత్తరిన్

శ్రీకృ- అర్జునా! ఏమిది? కౌంతేయుతిని చూచి రాధేయుడనుకొంటివా యేమి? శత్రుసంహారమింకను కాకున్నదను విచారంబుననగ్రజుండేదియో బల్కినంతమాత్రము నా మాటలను నీవు పాటించవలయునా?

ధర్మ:- కృష్ణా! నీ మరది నేల నివారించెదవు? రానిమ్ము ఈ యనమగ్రుని మస్తకంబు దెగవేయనిమ్ము

ఉ, ఇతడు నేను కారణము యిన్ని విధంబుల కష్టమొందగా
కాంత కగౌరవంబునటగాక వనంబుల కేగ, బాలకుం
డంతము నొంద మూలమగు నట్టి దురాత్ము నన్ను చంపుచో
నంతయు దోసమా నె మధుసూదన! పున్నెమువాని కబ్బదే?

శ్రీకృ- యుధిష్టరమహారాజా! అనవసరముగ నిన్ను నీ వేలనిందించుకొందువు? మరికొంచెము నీవు మనసోపికపట్టినచో కార్యంబులన్నియు ననుకూలంబులు కాగలవు. అర్జునా! చూచితివిగదా ఈ మహానుభావునియందుగల శాంతగుణంబు

అర్జు:, బావా! నేనుమాత్ర మేమంటినని నాగాండీవంబు నొరుల కిమ్మనవలయును? ధర్మసంభవు లెప్పుడైన పల్లెత్తుమాటని యెరుంగుదునా? కర్ణ సంహార మొకింత జాలమైనందులకే నిన్ని మాట లనవలయునా?

శ్రీకృ- ఇందు నీ తప్పులేదు-ధర్మజుని దోషమంతకంటెను లేదు, వృథా కలహ కారణంబునకలతనొందిన మీ యన్నను క్షమాభిక్ష నర్థింపుము రణంబున కేగి రాధేయ సంహార మొనరింతము

అర్జు:- (కరములు మోడ్చి) దేవా! అజాతశత్రవా!

గీ. గాండివ మొదుల కిమ్మను కారణమున
గాఢకోపానలజ్వాల గ్రాకిపోయి
యేమియోపల్కు నాపల్కు నెల్ల సైపవలయు వేగంబుగా నీవు పాండుపుత్ర!

శ్రీకృ:- ధర్మజా! నీతమ్ము ననుగ్రహించి మాకాజ్ఞ యొసంగుము.

గీ॥ శల్యసారథ్య మీనాడు సాయమగును
మలకుకొంత రాధేయుని మాటుబెట్ట

తరుణమబ్బె పోవలె నింక ధర్మరాజ !
జాగుసేయక పంపుమీ సత్వరమున.

ధర్మ— కృష్ణా ! అటులనే పోయిరండు. వత్సా ! ధనంజయా ! రాధేయుడు దుర్మదాంధ కారంబున నన్నెంత పరాభవించెనో నాకెరుక. అపరాభ వానలకీలలు నాహృదయము నింకనుదహించుచున్నవి.ఆతడింకనుచావడేదని పౌరుషంబుచేసీ కాగ్రహంబు గల్గింప నిట్లాడితివిగాని నీయందు వేరుభావముగాదు,

చ! అనుపమ విక్రమ క్రమ సహాయుడవై రణమందు నేడు క
ర్ణుని వధించిరమ్ము ఇదెరూఢి జయంబగుగాక-శౌరి నీ
కనువుగ ముందునిల్చి విషయంబు సమస్తము దెల్పుచుండగా
మనమున శంక లేక చనుమా! రిపువర్గమునింక ద్రుంపుమా!

అర్జు:- చిత్తము.

(యుద్ధరంగమున శల్యుడు- కర్ణుడు ప్రవేశింతురు,)

శల్యు- కర్ణా నీకీ వృధాప్రయాస యెందుకు? ఈ ధారుణీచక్రమైన కదులునేమో కాని నీ రధచక్రముమాత్రము కదలదు,

క. ఇది విప్రశాపమాటను
కదలదు నీ చక్రమింక కర్ణా! నేడీ
కదనమును మాని పొమ్మిదె
పదపడి చూడంగవచ్చు పార్థునిబలమున్,

కర్ణు;— మద్రేశ్వరా! వీరధర్మమూర్తియగునీకర్ణునకా పిరికి మాటలు చెప్పుచుంటివి. కాలమనుకూలమైన కయ్యంబున నిలుచుటయు లేకున్న పారిపోవుట కీరాధేయుడు పాండవులవంటివా డను కొంటివా ?

ఉ. సంగరరంగమందెదిరి శాత్రవులన్ బరిమార్తు కానిచో
సంగరమందు ప్రాణములనైతము వీడియె వీరస్వర్గమున్
భంగములేక జేరెదను ప్రాజ్ఞులు మెచ్చగ - లేక-క్రీడు డా
యంగ భయంబు జెందెడు భయస్థుడుగాడు మిత్రమా!

శల్యు:- ఓయీ! ఎందులకీ బీరములాడెదవు. సమయము తప్పినవు డోకించుక తలవంచినచో జీవించునంత కాలము తలనెత్తి తిరుగ

వచ్చును. రాధేయా! నీకీదినము శాపంబులన్నియు సమకూడు చున్నవి. అందులకు ప్రథమ నిదర్శన మీరథచక్రము నేల క్రుంగుటయే సుమీ,

కర్ణు:— శల్యా ఏమినీ యమాయకత్వము? ధనంజయుని రక్షించు కోదలంచి దేవేంద్రుఁడు మాయబ్రాహ్మణ వేషధారియై నా కడకువచ్చి కవచకుండలము లర్థించినాఁడా కపటనాటక మెఱుం గకయే యిచ్చితిననుకొంటివా? సూర్యభగవానుఁడా విషయ మును గూర్చి చెప్పినను నా దాతృత్వంబునకు లోపంబు రానీ యనని చెప్పిన మాట నీ వెఱింగియు నిట్లుమాటాడెద వేల?

క. పుట్టినపిమ్మట జీవుఁడు
గిట్టకబోఁడెవ్వఁడైన—గిట్టక ముందే
మెట్టినకాలముననె చే
పట్టవలయు గీర్తికాంత పాణినివిడకన్,

(కృష్ణార్జునులు ప్రవేశింతురు)

శ్రీకృ:— అర్జునా! చూచితివిగదా. కర్ణ రథచక్రము భూమి క్రుంగి పోయినది. వాని శాపఫలంబులన్నియు నేఁ డనుకూలించినవి. రాధేయుఁడీ దినముగాక మఱొక్కమారు నీచేత మడియఁబోఁడు, త్వరగసమీపింతమురమ్ము,

అర్జు:— అటులనేచేయుదును. ఓయీ! రాధేయా! సమర ముహూ ర్తము సమీపించినది, మరి రథమధిరోహించి విల్లు ధరింపుము

కర్ణు— అర్జునా నారథచక్రమీ భూమిక్రుంగినది. మదీయ భుజబలం బున దాని బెకలించుచుంటినిగాన యించుక యోపికపట్టుము.

అర్జు— యుద్ధకాల మట్లు వ్యర్థపుచ్చకొన్ననెట్లు? నీ కింక వ్యవధాన మొసంగుటకు వీలులేదు. విల్లుధరింపుము.

కర్ణు— పాండవ మధ్యమా! రథంబు లేని వానితో రథాధిరోహితులు యుద్ధముసేయుటధర్మమా? అటులైన అరదముదిగిరమ్ముగదా యుద్ధమొనరింతము.

శ్రీకృ— [నవ్వి) రాధేయా! నీకీ రణధర్మములు రాచధర్మములు నేడే తెలిసినవా ?ఇదివరలో తెలిసినవా? ఎన్నడూవినని ధర్మము లీనాడు నీ నోటవినుచుంటిని.

గీ, ఒంటిబాలుడై రణభూమి నున్న వేళ
పదుగురొక్కటియై రధాశ్వముల జంపి
రథమును విదలించి సారథినింగూల్చు
వేళ యీధర్మవాక్య మేమూలదాగె ?

(అశ్వత్థామ ప్రవేశించును)

అశ్వ— కర్ణా! నేను నీకు సాయపడవచ్చితిని. తేరువును వీడి గదాపాణివై యుద్ధమొనరింపుము.

కర్ణ— ఆచార్యనందనా అసహాయశూరుడగు యీ రాధేయుడు నీ సహాయ మపేక్షించువాడు కాడు—నీ విప్రసహాయము నా కక్కర లేదు, తొలగి యుండుము?

అశ్వ— ఓరీ గర్వాంధకారా ! ఏమంటివి? విప్రసహాయమక్కర లేదా ? అవును. దుర్యోధనుడు కర్ణునికి సహాయము చేయుడు పొందు, పొండని ప్రార్థించుటచే నిందునచ్చితిగాని లేకున్న నీపై దయ గల్గి వచ్చితిననుకొంటివా ?

కర్ణ— ఔను. నీకు నాయందుదయ లేదని యెఱుంగుదును కావున నే నీసహాయ మక్కర లేదంటిని, తెలిసినదా?

అశ్వ— నాకిది తెలిసిన నేమి? తెలియకున్న నేమి? ఇంకొక్కగడియలో పార్థునిచేత బడనున్న నీపాటునుగూర్చి తెలిసికొనుము,

కర్ణ— దాని కేమి? నీవింక దూరమున నుండుము,

శ్రీకృ— సూతపుత్రా! ఇంకనూ జాలమొనర్చుచుంటి వేల?

కర్ణ—మాధవా? జాలనేమియును లేదు, పార్థుని రమ్మనుము, ధర నుండియే సమర మొనరింతును, (రధమునందున్న గదను తీసుకొన బోవుచుండ శల్యుడు వారించును.) శల్యా ! ఏమిది?

శల్య— రాధేయా ! ప్రమాదము,

శ్రీకృ— అర్జునా ఇంక తడయరాదు. వెంటనే విలుధరించి కర్ణశిరం
బును దెగవేయకున్న గోళ్ళతో దునుము దానిని గొడ్డళ్ళతో
దు్రించినంత పనియగును,

అర్జు— అధర్మ యుద్ధమునకు మనసొప్పకున్నది బావా!

శ్రీకృ- వెర్రివాడా : ధర్మమేమి? అధర్మమేమి? మీపట్ల నీ తండ్రి
కురురాజుచే చేయించిన పనులన్నియు ధర్మములే యగునా?

సీ. నిదురించు భీముని నీటద్రోసిన వేళ
నారయలేదే యీ న్యాయపథము?
అర్థరాతిరి యింటి కగ్గి ముట్టించుచో
తర్కింపలేదె యీ ధర్మపథము!
మాయజూదమున నయాయకుడౌ రేని
గెల్చునాడెంచ రేకీర్తిపథము?
నిండుసభను నొక నెలతకోక లొలువ
మరచినారేమి యీ మాన్యపథము?

గీ. నాడులేని నీతిపథ మీనాడువచ్చె
పగర నిర్జింప నానీతి పథమదేమి?
సమయమేరిగి వర్తించుటే సరసమగుట
యిందు దెంపు మితనితల పుడమిపడగ

అర్జు— మహాత్మా మీ యాజ్ఞానుసారముగ నిదిగో శరమును సంధిం
చుచున్నాను,

శల్యు— కర్ణా ఇక మరణించితివి.

అర్జు— రాధేయా కాచుకొమ్ము.

[తెర వ్రాలును]

# కురుక్షేత్రము

## [ దశమాంకము ]

### పాండవ విజయము

(నీటిమడుగు సమీపమున దుర్యోధనుడు - అశ్వత్థామ ప్రవేశింతురు)

దుర్యో:— గురుకుమారా!

చ. దురమున వీరులై వెలయు తోంబదితొమ్మిదిమందిత మ్ముఁలున్
వరసుతులున్ పరిజల్ నృపులు ప్రాణహీతుండగు కర్ణుఁడాది ధీ
వరులు గతికిచె నేటింటు పాండవ ఘోరరణంబుజూడ మేసిన్ కి
దరుగని తాపమే యొదవె దాగెదనించుక నీజలంబులన్

అశ్వ:— దుర్యోధనా! రణధర్మవిశారదుండగు నీ అశ్వత్థామ మేనజీవంబు లుండ నీ కేమియు భయంబులేదు. ధైర్యము వహింపుము,

దుర్యో:— అయ్యా! ఇంతదనుక జరిగిననాకింక భయమేమి? భ్రాంతియేమి? కేవలము తుచ్ఛజీవితమునకై నేనీకాసారంబున దాగదలంపలేదు. సకల బంధుమిత్రసేనా సమూహంబులు హరించిన నా మనోవేదనచేగలిగిన వేడిమిని బోశార్చుకొనుటకై యించుకింతదాగి పిమ్మట వారిపై తిరుణం బెరింగి మట్టుబెట్టవలయుననియే నా సంకల్పము

అశ్వ:— రాజరాజా! రణభారంబుననుండి విశ్రాంతి బొందుటావశ్యము గాన నీదలంచినటు లీజలాశయంబున నే నుండుము; నేనుమరలి వచ్చెదను నీవు జలస్తంభన విద్యాధనుండవగుటచేత జాగరూకతతో మెలంగుము.

గీ॥ పరులు నీ గుట్టెరుంగ రేపాటినైన
ఎరిగి బిల్చినగాని నీవింతయేని
వెలికిరాకు నే వచ్చెద వేగమిటకు
పిదప జూతమా కదన మే విధము నానో

దుర్యో:- సరే. మీరు త్వరలో దయచేయుడు. నాకును తాపమధిక
మగుచున్నది. ఆహా కాలమహిమ

గీ॥ నాటి మయసభయందున్న నీటిబడుట
దనరిన పరాభవానల తాపమిటులు
పెరిగి పెద్దదై నేటికీకరణిమీర
మాటియుండెగా వెలసె నీ మడుగులోన.

(అశ్వత్థామనిష్క్రమించును. దుర్యోధనుడు మడుగున దాగును)
(పిమ్మట పాండవులు, శ్రీకృష్ణుడు, జాలరి ప్రవేశింతురు)

ధర్మ:- ఓరీ! జాలరీ! రాజరాజుని నీ వెందుజూచితివి?
జాల:- ఈ మడుగునందే చూచితిని మహారాజా!
శ్రీకృ:- ఓయీ! సుయోధనుండేన నీ వెట్లు గురుతించితివి?
జాల:- తెలియక పోవుటేమిదొరా! ఏలికగారిని నే నింతకుముందెన్ని సారులు సూడలేదు. దుర్యోధనయ్యదొరోరిని బాగా ఆనవాలు పట్టాను.
భీము:- సరె, అట్లైన నీవింక వెళ్ళుము.
జాల:- సిత్తం దొరబాబుల్లారా! (నిష్క్రమించును)
అర్జు:- దుర్యోధన మహారాజా! ఇందేల దాగితివయ్యా! వెలికి దయచేయుట కేమయిన నభ్యంతరమున్నదా?
భీము:- అన్నయ్యా! వెలికి వచ్చుటకాయన కభ్యంతరమున్నచో నిరభ్యంతరముగ నేనీ మడుగునుజొచ్చి కలవర పెట్టుదునా?
శ్రీకృ:- మారుతాత్మజా! తొందర నొందకుము. ఈ జలాశయంబు సామాన్యమయినదిగాదు, అగాధంబగునీ కాసారంబున కురురాజు జలస్తంభన విద్యావంతుడగుటచే నిలవంజాలెగాని, సామాన్యుడయినచో నీ పాటికి మరణించియే యుండును.
నకు:- అట్లైనచో నాడెంతెట్టు జలంబులనుండి వెలికి వచ్చును?
సహ:- రాకున్న మనము సేయదగిన కార్యమేమి?
అర్జు:- తిరిగిపోయి హస్తినాపురము స్వాధీనపరచుకొనుటయే దాని కన్యాలోచనలేల

మ, నృపాడాభీతిలి రాజ్యలక్ష్మినిటు మున్నే వీడి యేతెంచె; నా
నృపసైన్యంబు సమస్తమున్ జదిసె, వానిన్ పైకొనన్ బూననే
నృపుడున్ లేడిక యుద్ధమేల? ఃపనమానిశ్చింతతన్ బోయి యీ
నృపునిన్ పీఠమునందు నిల్పుదము కానిండీ మహాకార్యమున్.
(శ్రీకృ):- అర్జునా! పొరబడుచుంటివిసుమా! శత్రుశేషంబును ఋణ
శేషంబునుండరాదని యెరింగియు నిట్లనుచుంటివేమి? నాడు
సైంథవుండుజీవించి యున్నందున నేగదా యభిమన్యుని చావునకు
మూలకారణంబయ్యె ధర్మనందనా! నీవేవానిని పౌరుషేయంబు
లతో బిలువుము, అభిమానధనుండైన తప్పక బయల్వెడగలడు,
ధర్మ:— ఓయీ! దుర్యోధనసార్వభౌమా!
ఉ.సమ్మతి చెప్పనాడు వినజాలక మొండితనాన నేటికిన్
తమ్ముల జంపుకొంటివి, సుతప్రకరంబును బాసితీవు.
సైన్యమును, కర్ణునిన్, నృపులనందరి బాసిన నీవు బాసిప్రా
ణమ్ములనుండగా దలచినాడవె, నీటమునింగి మూర్ఖుడా!
గీ. పృథ్వి నేలు కాలమునందు పెట్టినావు
చెప్పరాని యిక్కట్టులు తప్పకుండ
మడుగునందు దాగియుగూడ మాకు నౌర
పెట్టినాడవు తీరని పెద్దచిక్కు
ఓయీ కురుకుల వంశనాశనకారణా! సుయోధనా! ఎంత
కాలయు దాగి యుండెదవు

చ. జలముల దాగినన్ విడువజాలము నిన్ను సుయోధనా! వృధా
తలపులు నీకికేల? ఇక తప్పదు నీవిటురాక నాజిలో
గెలిచిన ధారుణీతలము కీర్తి నేలుము లేదయేని మా
ములుకుల ప్రాణముల్ విడిన బోవును తొల్లిటివైరమింతటన్

(దుర్యోధనుడు ప్రవేశించును)

దుర్యో:- ధర్మరాజా!
ఉ. తమ్ములు మిత్రుడున్ సుతులు తక్కినబంధులు, రాజులెల్ల యు
ద్ధమ్మున గూలినారలు వ్యథాభరితంబగు నామనంబు తా

తమ్ము ఘటింప. శాంతికయివచ్చితి నంతియెగాని.నాదుచి
త్తమ్మున జంకియే నిచట దాగినవాడనుగాను ధర్మజా!
అర్జు:- తాపము తీరినదా
నకు- సంతాపముతీరినదిగదా
సహ:- ఈతాపమింతట తీరునది కాదు
ధర్మ:- దుర్యోధనా! ఇంకను చూచుచుంటివేమి, యుద్ధమాడెదవా
లేదా
దుర్యో- (స్వగ) అయ్యో అశ్వత్థామ యింకను రాలేదుగదా?
ఏమి సేయుదును? (ప్రకాశముగ పాండవులారా

ఉ. ఏను నిరాయుధుండ, గన నేవురు మీరు రణంబుసేయ, నే
నైనను ధర్మమానె నిజమారసి దెప్పుడున్యాయమేదొ ఆ
ద్దాని నె బూనువాడ రణమాడగ నే వెనుకాడబోను కీ
డైనను మేలెయైనను భయంబిక లేదు ధరిత్రినింతయున్

శ్రీకృ:- ధృతరాష్ట్రనందనా! ఇప్పటికేనియు నీకా రణన్యాయము
దెలిసినందులకు సంతోషము. కాని యిందరితో నిన్ను పోరాడ
మంటిమా? లేదు, లేదు,

ఉ. పాండవులందు నీ మనసువచ్చిన వీరునితోడనే గదా
దండముదాల్చి పోరుమిక ధర్మజుడో పవనాత్మజుండో పా
ర్థుండో మరెంచిచూడ నకులుండో కనిష్టుడో చూచి చెప్పు మా
తండె రణస్థలిన్ నిలుచునయ్య నిజంబుగ కౌరవేశ్వరా!
(తెరలో) ఓయీ! సుయోధనుండెక్కడ
శ్రీకృ:- బావా! మీ వియ్యంకుడగు బలరాముండదే వచ్చుచుండె
అర్జు:- ఇంకను వియ్యంకుడనేల మాధవా?
శ్రీకృ:- పాతచుట్టరిక మొకనాటిదిగాదు బావా?

(బలరాముడు ప్రవేశించి)

బల:- దుర్యోధనసార్వభౌమా! నేను తీర్థయాత్రలు సేవించి వచ్చు
లోపలనే యెంతపనిజరిగినది? ఎంతపనిజరిగినది?

దుర్యో:- జరిగినది మహానీయా !

ఉ, భారతయుద్ధరంగమున బంధువులెల్లరు సూతపుత్రుడుం
వీరభటుల్ ప్రజల్ నృపులు పిన్నలు నెంద రెందరో
మారణమై గతించె నభిమన్యుడు లక్ష్మణుడాది బాలురున్
కౌరవనాథుడే మిగిలె కష్టములన్నియుచూచి యేడ్వ

బల:- హా; సౌభద్రా! శశిరేఖాదుల దిక్కుమాలిన వారిని చేసి వీర స్వర్గమలంకరించితివా ? కృష్ణా ఇన్ని మాయనాటకంబులనాడు నాబిడ్డ నభిమన్యున కిప్పించినదీ ప్రాలున కేనా ?

శ్రీకృ;- అన్నయ్యా అల్లుడును మేనల్లుడైన సౌభద్రుని మరణంబును గూర్చి చింతించుచున్న నన్నేల నిష్ఠురంబులాడెదవు: అదియు మనశశియదృష్టముగాని రాజరాజుకోడలైనను యీవైధవ్యము తప్పునది కాదుగదా ;

ధర్మ;- పెద్దబావా! మీరిందు కూర్చుండి దుర్యోధన భీమసేనుల ధర్మయుద్ధ మవలోకింపుడు.

బల;- మంచిది కానిండు.

దుర్యో:-- వాయునందనా! ఇది కాసారము గట్టుగదా? కొంచెమావ లకుబోయి పోరాడుదము రమ్ము,

భీము:- అటులనేరమ్ము,

(భీమదుర్యోధనులు నిష్క్రమింతురు)

బల:- ఆహా! దుర్యోధను డింత చింతాక్రాంతుడై యుండియు నెంత లాఘవంబుగ సంగ్రామమొనర్చుచున్నాడు ?

ఉ. భీమగదావిధానమున ప్రేటొకటిన్ దినకుండ బల్
ధీమ తనాన తప్పుకొని దీటుతగన్ మరిమొత్తగల్గి సం
గ్రామమునందు లంఘనము గన్పడపోర దొడంగె రాజరా
జీ మహి చూచువారి కనులెంతయు దిగ్భ్రమనొందుచుండగా

(రోషమున లేచి) ఓరీ! భీమసేనా ఎంతపని చేసితివి ? నాభి క్రిందగా కొట్టరాదని యెరింగిన నీవు కురుపతి తొడపై గొట్టితివిగా చూడుము. నిన్నేమి చేయుదునో ?

శ్రీకృ- అన్నా! నిజము విచారింపక యూరక తొందరబడెదవేమి? భీమగదా తాడనమంకమందే తగిలినదో పార్శ్వంబుపై తగిలినదో గమనించకయే మాటాడనగునా? వినుము —

క, తొడపై కూర్చుండు మనుచు
నుడువగ కురురాజ తొడలు నుగ్గొనరింపన్
వడి ప్రతినబూనెగద భీ
ముడు నాడా మాటచెల్లె పోరున నేడున్'

బల- ఓయీ? అసందర్భప్రలాపీ ? ఏమి ధర్మములు చెప్పితివి ?

గీ, ప్రతినజేసిన తమకెంత వైరమున్న
ధర్మయుద్ధాన గెల్చి పిదప నె తొల్లి
శపధమంచు తనదు పౌరుషము చూప
నగునుగాని యీ కయ్యంబు న్యాయమగునె ?

రమ్ము సుయోధనుని సమీపించి చూతము. (అని ధర్మజ అర్జున నకుల సహదేవ బలరామకృష్ణులు దుర్యోధనుని సమీపింతురు.)

దుర్యో:- రామా ! ధర్మమూర్తివగు నీవుండియు నాకిట్టి యన్యాయము జరుగుచుండ చూచుచుంటివిగదా?

బల:- లేదు—లేదు. నే నీ యకృత్యంబును సహింపలేదు. కృష్ణా ? భీముని లోపమును గూర్చి నీవేమియు సమర్థించుచుంటివిగదా? యిపుడేమందువు? ఓరీ దుష్టభీమసేనా రణధర్మవిరుద్ధంబుగ నిమ్మహారాజాంకంబున గొట్టినందులకు ఫలమును భవించెదవు:

గీ, నాభిక్రిందను కొట్టితే న్యాయమనుచు,
కొట్టినాడవు చెప్పుమో కూళ యిపుడు
హలమునను నిన్ను గూల్చెద బలమొకింత
కల్గెనేని రమ్మిదే ముందు కయ్యమునకు:

భీము:— నీ కయ్యముమాట కేమిగాని. ఈ రారాజును యూరువుపై గొట్టుటెగాదు మరి. యేమిచేసినను పాపమున్నదే ? (అని దుర్యోధనుని తల తన్నును)

బల:- (రోషముతో) ఆఁ! ఏమిరా మూర్ఖా ! (భీముని కదుకును)

కృ:— (వారించి) బావా! వానిని నేను మందలింతును. నాయందున దయయుంచి నీవు శాంతింపుము. భీమసేనా! ఎంత పనిచేసితివి? ఏది ఎట్లైనను సుయోధనునిశిరమును దన్నవచ్చునా

గీ. ధరణీచక్ర మేకపథ్యముగ నేలు
కురువిభుండు, పెత్తండ్రికి కొడుకుననుట
కనకరత్నమయ కిరీటముసు ధరించు
భవ్యశిరమిట్లు దన్నంగ బాడియగునె!

భీము:— అన్నా! నీ వెన్ని చెప్పినను నాకోపంబుదీరదు... వీనిని తన్నుటయెగాదు. నాపాదములక్రింద నలిపివేసినను నా కోపాగ్ని చల్లారునగుట లేదు నన్ను వారింపకుము (మరలతన్న బోవును

బల— ఓరీ! గర్వాంధులారా ఇంక నేనీ యకృత్యంబులను సహింపను

క. రారా! దుర్మతి రారా
వీరుండవునైన నిలిచి వేగమునాతో
బోరాడశంక నేటికి
శూరత్వంబేదియో మఱికిచూపెదనీకున్

శ్రీకృ:— అన్నా! మున్ను రారాజొనరించిన ఘోరకృత్యంబుల దలంచుము నమాయకుండగు నీమారుతి చేతములందును దోషము లేక పోలేదు. ఐనను, అయ్యుదివారికి గల చిరకాల దాయాది మచ్చరము. బంధువులమగు మన మద్దానజోక్యంబు గలిగించుకొననేల? సోదర ద్వేషము సహజమేగదా?

బల:— ఓయీ! మాయావీ! అన్నదమ్ముల పగలున్న వనుచు నీ యుక్తులు పన్నితివి, ఇంకేమి? యిక నీయిచ్చవచ్చినటులే గావింపుము,

ధర్మ— రాజరాజా? నీవనినటుల నేనీ కురుసింహాసన మధిష్టింపగనున్న మాట నిక్కువంబేగాని ప్రయోజనంబేమి;

దుర్యో:— ఏమి?

ధర్మ!— ఏమున్నది? సింహాసనము లభించినంత మాత్రమున సంతోష మేమున్నది? కురుకుల సార్వభౌమా!

శా. ఆలుంబిడ్డలు. చుట్టపక్కములతో నానందముంబొంది సు
శ్రీలం దేలెడు రాజ్యలక్ష్మియును నీచేపాలితంబయ్యె: నే
డాలంబందున సర్వనాశమునై ఆర్తధ్వనుల్ నిండ నే
నేలన్ నిల్చి స్మశానఘట్టమటులే నేనున్ విలోకింపగా,

కావున నాకంటె నీవే ధన్యుండవగుదువు.

శ్రీకృ— పాండవులారా ! ఇప్పటికి కురువంశ మంతరించినది. భారత సంగ్రామంబును పూర్తియైనది. ఇది పాండవ విజయము, యిక ధర్మనందన పట్టాభిషేకంబునుగూర్చి ప్రయత్నము సేయవలయును. గానత్వరగా బోవుదమురండు.

ఉ. ఏమిదిజాగుచేయ? పదునెన్మిది రోజులనుండి వీర సం
గ్రామమునందు సింతశ్రమగాంచిన వారలు విశ్రమింపగా
క్షేమముతో గృహంబులకు చేరుటమంచిది పోదమింక. రా
రా? మరికూర్కవోవర? దురంతము దంబున హాయినొందరా

ధర్మ— మహాత్మా! ఈ పాండవవిజయ శుభసమయంబున—

శ్రీకృ— ఇట్లగుగాక—

గీ. అన్నదమ్ములిల పరస్పరానురాగ
బద్ధులై సర్వసద్గుణ భావులై, చి
రాయురారోగ్య సంపదలంది, భక్తి
రక్తి ముక్తికి పాత్రులై గ్రాలుగాత,

అందరు ... మంచిది

